Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 34 • 26-8-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# జైలు కెళ్లినా జనం నాతోనే!

**జగన్ ధీమా**

జగన్ ఆశలు అడియాసలైనాయి. సుప్రీం కోర్టులో ఉపశమనం దొరుకుతుందని చేసిన చిట్టచివరి ప్రయత్నం విఫలమైంది. ఇక మిగిలింది ఒకే దారి. సిబిఐ విచారణ ఎదుర్కోవాలి. అదేమీ ఆషామాషీ వ్యవహారం కాదు. తాను సంపాదించిన వేల కోట్ల ఆర్జనకు లెక్కలు చెప్పాలి. తూర్పు ఐరోపా నియంతలను తలదన్నే రీతిలో నిర్మించిన రాజ ప్రాసాదాల వంటి భవనాల మూలాలు వెల్లడించాలి. దేశ విదేశాలలో లెక్కకు మించి నెలకొల్పిన కంపెనీల వివరాలు తెలపాలి. వాటి నుంచి ప్రవహింప చేసిన వేల కోట్ల రూపాయల నిధు లెక్కడి నుంచి వచ్చాయో విశదం చేయాలి.

రాజకీయాలతో అవినీతికి పాల్పడని వాడంటూ ఎవడూ లేడు. నీతిగా వుంటే రాజకీయాలలో బ్రతకలేరు. మన్మోహన్‌సింగ్, ఎకె ఆంటోనీ వంటి అరుదైన వ్యక్తులకు మినహాయింపు వున్నా, వారి సంఖ్య దేశం మొత్తం మీద చూసినా వేళ్ల మీద లెక్క పెట్టవచ్చు. కానీ అవినీతి హద్దులు దాటితే, తనను ఎవరూ ఏమీ చేయలేరన్న అహంకారంతో ప్రవర్తిస్తే దుర్గతి పాలు కాక తప్పదనడానికి జగన్ జీవితం ఒక ఉదాహరణ.

వైఎస్.రాజశేఖర్‌రెడ్డి అధికారాన్ని జగన్ ఎవరి వూహకూ అందనంత దుర్వినియోగం చేశాడు. తన తండ్రి ప్రభుత్వ అధినేత మాత్రమే అన్న నిజాన్ని విస్మరించి, ప్రభుత్వమే తనదన్న ధోరణిలో చెలరేగిపోయాడు. రాత్రికి రాత్రి అపరకుబేరుడిగా ఎదగాలన్న తమకంతో ఈ దేశంలో కొన్ని చట్టాలున్నాయని, వాటిని అందరూ శిరసావహించాలని మర్చిపోయాడు. తాను చేసిన తప్పేమిటో తెలుసుకొనేసరికి పుణ్యకాలం దాటి పోయింది. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొని లాభం లేదు.

కాంగ్రెస్ పార్టీ, సోనియాగాంధీ కక్ష కట్టి జగన్ మీద సిబిఐ విచారణ జరిపిస్తున్నదని ఎంత గోల చేసినా, వచ్చే ప్రయోజనం ఏమీ లేదు. రాజకీయ వివాదాలను చొప్పించినంత మాత్రాన ఈ సమస్య పరిష్కారం కాదు. హైకోర్టు, సుప్రీంకోర్టు ప్రమేయం వున్న కేసులలో సిబిఐ ఒళ్లు దగ్గర పెట్టుకొని పని చేస్తున్నది. ఏ మాత్రం అజాగ్రత్తగా వ్యవహారం చేసినా న్యాయస్థానాలు తాట తీస్తాయి. నిలబెట్టి కడిగి పారేస్తాయి. అందువల్ల జగన్ చాలా కఠినమైన అగ్ని పరీక్షను ఎదుర్కోక తప్పదు.

## చట్టాల ఉల్లంఘన!

కేవలం అక్రమార్జన అయితే ఒక రకం. అంత కంటే అధికంగా చట్టాల ఉల్లంఘన వుంది జగన్ వ్యవహారంలో. లంచాల రూపంలో వచ్చిన నల్ల ధనాన్ని తెల్ల ధనంగా మార్చుకొనే ప్రయత్నంలో, ఒకేసారి అంబానీ అంత పారిశ్రామికవేత్తగా ఎదగాలన్న తొందరలో చాలా తప్పులు చేశాడు జగన్.

కొరవ 14వ పేజీలో





# మరో విప్లవం

అన్నాహజారే కోరికలు ఆచరణ సాధ్యమా? ఆయన అడుగుతున్న జన్ లోక్‌పాల్ బిల్లు వల్ల దేశంలో అవినీతి నిర్మూలనై పోతుందా? దాన్ని ఆమోదిస్తే పార్లమెంటుకు వచ్చే నష్టం ఏమిటి? ప్రభుత్వానికి వచ్చే కష్టం ఏమిటి? అన్నా వంటి నలుగురైదుగురు వ్యక్తుల బృందాన్ని ఇంత పెద్ద దేశంలో పౌర సమాజ ప్రతినిధులుగా అంగీకరించ వచ్చా? నలుగురు వ్యక్తులు, వారెంత ఉన్నత వ్యక్తిత్వం కల్గిన వారైనా, దేశంలో తాము చెప్పిందే జరగాలని శాసించడం ధర్మమా? ఆ మాటలను శిరసావహించాలని ప్రభుత్వాలను ఒత్తిడి చేయడం న్యాయమా? వారి ఆలోచనలలో తప్పిదం వుంటే జరిగే నష్టానికి ఎవరు బాధ్యత వహిస్తారు?

ఈ ప్రశ్నలు వేటికీ ప్రజల దగ్గర సమాధానాలు లేవు. వాటిని పట్టించుకొనే స్థితిలో జనం లేరు. జన్ లోక్‌పాల్ బిల్లు అంటే ఏమిటో, దానివల్ల కలిగే లాభాలు, ఎదురయ్యే సవాళ్లు ఏమిటో కూడా ప్రజానీకానికి తెలియదు. వారికి తెలిసిందల్లా, వెయ్యి పడగల విష సర్పం వలె బుసలు కొడుతున్న అవినీతి మహమ్మారిపై అన్నా హజారే యుద్ధం ప్రకటించాడన్నది నిజం. దానికి మనమూ మద్దతు పలకాలనే సంకల్పం. అందుకోసమే, లక్షలాది మంది మధ్య తరగతి యువతీ యువకులు ఆయన పిలుపుకు స్పందిస్తున్నారు. ఏ రాజకీయ పార్టీ ప్రమేయం లేకుండా, ఏ నాయకుడూ జన సమీకరణ జరపకుండా, స్వచ్ఛందంగా ప్రతి వూరిలో వేల సంఖ్యలో జనం వీధులలోకి వస్తున్నారు. మరీ ముఖ్యంగా విద్యార్థులు, కంప్యూటర్ రంగంలో పని చేసే వుద్యోగులు ఉత్సాహంతో వురకలు వేస్తున్నారు. అవినీతి నిర్మూలన జరగాలని రంకెలు పెడుతున్నారు. మానవ హారాలు నిర్మిస్తున్నారు. కొవ్వొత్తుల ప్రదర్శనలు చేస్తున్నారు. యువతరం ధాటికి కేంద్ర ప్రభుత్వం తుఫాను గాలిలో చిగురుటాకు వలె వణికి పోతున్నది. ప్రధాని మన్మోహన్‌సింగ్‌తో సహా సీనియర్ మంత్రులందరూ తలపోటుతో సతమతమౌతున్నారు. ప్రతిపక్షమైన బిజెపి కూడా సంకటంలో పడిపోతున్నది. ప్రజలు మాత్రం వేలం వెర్రిగా ఈ ఉద్యమంలో పాలుపంచుకొంటున్నారు. టైమ్స్ ఆఫ్ ఇండియా ఆంగ్ల దినపత్రిక ఇంటర్నెట్‌లో ఒక ఒపీనియన్ పోల్ నిర్వహిస్తే దాదాపు 30 లక్షల మంది పౌరులు అన్నా హజారేకు అనుకూలత వ్యక్తం చేశారు. ప్రపంచ చరిత్రలోనే ఒక సామాజిక అంశం మీద ఇంతమంది ప్రజలు ఆసక్తి చూపడం ఒక రికార్డు. దేశ ప్రజానీకానికి అవినీతి మీద ఎంత రోత పుట్టి వుందో, దాన్ని నిర్మూలించాలన్న సంకల్పం ఎంత బలీయంగావుందోఅర్థం చేసుకోవడానికి ఇదొక ఉదాహరణ.

జమీన్‌రైతు

దీన్ని ఒక నూతన తరహా విప్లవంగా వర్ణించినా తప్పు కాబోదు. విప్లవం వస్తేగానీ రాజకీయ వ్యవస్థలు మారవన్నది చరిత్ర చెప్తున్న సత్యం. అందుకోసమే గత యాభై ఏళ్లుగా నక్సలైట్ ఉద్యమం నడుస్తున్నది. కానీ దానికి ఆశించిన స్థాయిలో ప్రజా స్పందన లభించలేదు. వ్యవస్థ మారాలన్న కోరిక ప్రజలలో ఎంత బలీయంగా వున్నా, హింసను కూడా అంతే తీవ్రతతో వ్యతిరేకించే భారతీయ మనస్తత్వం అందుకు కారణం. ఇప్పుడు అన్నా హజారే హింసకు తావులేని ఉద్యమానికి శ్రీకారం చుట్టాడు. ఆయన ఎంచుకొన్న అంశం మీద గాఢమైన ఆసక్తి, ఎన్నుకొన్న మార్గం మీద సానుకూలత వున్నందువల్ల ప్రజలు ఈ నూతన విప్లవంలో భాగస్వాములౌతున్నారు.

ప్రజాస్వామ్య పాలనలో ప్రజల అభిప్రాయాలను కాదని ఏ ప్రభుత్వమూ మనుగడ సాగించలేదు. ఆ ప్రయత్నం చేసిన ప్రతిసారీ పతనమే ఫలితమని పలుమార్లు రుజువైంది. ఇందిరమ్మ వంటి ధీరోధాత్త నేత కూడా ప్రజాగ్రహానికి తల వంచక తప్పలేదు. హజారే ఎంచుకొన్న మార్గం తప్పా ఒప్పా అన్న చర్చ పక్కన పెట్టి, ఆయన అడుగుతున్న కోరికలను తీర్చడం మినహా కేంద్ర ప్రభుత్వానికి మరొక గత్యంతరం లేదు. జన్ లోక్‌పాల్ బిల్లు ఆమోదిస్తే వచ్చే పరిణామాల కంటే, దాన్ని తిరస్కరిస్తే కలిగే దుష్పరిణామాలే అధికమనడం వాస్తవం. ఆ నిజాన్ని గ్రహించి, సాధ్యమైనంత త్వరగా హజారే దీక్షను విరమింప చేయడం ఒక్కటే కేంద్రం ముందున్న పరిష్కార మార్గం.

## జనవాణి

### అనర్హులకు ప్రశంసలా?

స్వాతంత్ర్య దినోత్సవపు పెరేడ్‌లో ఉత్తమ సేవలకుగాను వెంకటగిరి మునిసిపల్ కమిషనర్, శానిటరీ ఇన్స్‌పెక్టర్, హౌసింగ్ ఎఇలకు మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చేతులమీదుగా ప్రశంసాపత్రాలిచ్చారు. పత్రికల్లో ఇది చదివి ఆశ్చర్యపోయాను. ఈ అధికారులు రాజకీయ నాయకుల అడుగులకు మడుగులొత్తడం, విధి నిర్వహణలో కచ్చితత్వం లేకపోవడం ముఖ్య అర్హతలు. వెంకటగిరి మునిసిపాలిటీ పరిధిలోని చాలా ప్రాంతాల్లో వీధి లైట్లు వెలగవు. మునిసిపల్ కార్యాలయంలో చిన్నపని జరగాలన్నా లంచాలు ఇవ్వవలసిందే. చిరుద్యోగులైన చెత్తవూడ్చే వారికి జీతాలివ్వక చంపుకతినేవారు ఉత్తమ అధికారులు ఎలా అవుతారు?

*తిరుపతి భాస్కరరావు* — వెంకటగిరి

### చక్కెర వ్యాధిగ్రస్తులను ఆదుకోండి!

పాత రోజుల్లో చక్కెర వ్యాధి(డయాబెటిస్) 60 సంవత్సరాలు పైబడిన వారిలో వంశానుగతంగా కనపడేది. ఇప్పుడు మన దేశ జనాభాలో 28 శాతం మంది, రాష్ట్ర జనాభాలో 25 శాతం ఈ వ్యాధిబారిన పడిన వారుండడం బాధాకరం. ఈ వ్యాధిగ్రస్తులను గుండె, మూత్రపిండాలు వంటి వ్యాధులు భవిష్యత్తులో బాధిస్తాయి. దేశానికి ఎంతగానో ఉపయోగపడే మానవ వనరులను ధ్వంసం చేస్తున్న చక్కెర వ్యాధిపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పూనుకొని అవగాహన కల్పించాలి. వ్యాధిగ్రస్తులైన పేదలకు మందులు, పరీక్షలు ఉచితంగా అందే ఏర్పాట్లు చేయాలి.

*పి.సాయిబాబా* — నెల్లూరు

### ఈ పథకం జోలికి పోకండి!

ప్రపంచంలో ఏ దేశంలోలేని పథకంగా రాజీవ్ ఆరోగ్యశ్రీ గుర్తింపు పొందింది. నిరుపేదల పాలిట ఒక వరంగా వున్న ఈ పథకంపై రాష్ట్ర ప్రభుత్వం కొన్ని ఆంక్షలు విధించడం బాధాకరం. ప్రభుత్వ ఆసుపత్రుల్లో కనీస వసతులు లేవు. వాటిని మెరుగు పర్చకుండా కొన్ని ఆపరేషన్లు అక్కడ చేయించుకోమని చెప్పడం ప్రజలను ఇబ్బంది పెట్టడమే. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, రాష్ట్ర ఆరోగ్య మంత్రి డాక్టర్ డి.ఎల్.రవీంద్రరెడ్డిలు ప్రజావ్యతిరేక నిర్ణయాలు మానమని విజ్ఞప్తి.

*డి.రమణయ్య* — కొడవలూరు

### మహిళలకు మేలు చేయరా?

చట్టసభల్లో మహిళలకు 33 శాతం రిజర్వేషన్ అని ఉపన్యాసాలు ఇవ్వడం తప్ప మహిళలకు ఇప్పటివరకు ఒనకూడిన ప్రయోజనమేమీ లేదు. ఈ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

29-8-1941
పేజీలు : 10 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

#### ఫస్ట్‌గ్రేడు కాలేజి

నిన్న సాహితీ సమితికి అధ్యక్షత వహించిన తిక్కవరపు రామిరెడ్డి గారు(విఆర్‌కాలేజి) ఫస్ట్‌గ్రేడు చేయించడానికి కమిటీవారు కృషిచేయమని ప్రబోధించారు. కమిటీవారు తమ తమ వర్గాలకు ఉద్యోగాలిస్తారు. కానీ ఫస్ట్‌గ్రేడ్‌కు కృషిజేస్తారా? భ్రష్టుగ్రేడ్‌కు తేకుంటే చాలు.

#### న్యూ కోమల విలాస్

కోమల విలాస్, కేరళ విలాస్ ఇత్యాది హోటళ్ల ధర్మకర్త అయిన నారాయణ నాయరు గారు ట్రంకు రోడ్డులో ఒక నవ్య సుందర భవనం నందు న్యూ కోమల విలాస్ అనే బోర్డింగ్, లాడ్జింగ్ భవనాన్ని స్థాపించాడు. దీన్ని జిల్లా కలెక్టర్ కరంతుల్లా సాహెబ్‌గారు ప్రారంభించారు. వీరు కలెక్టర్ ద్వారా యుద్ధనిధికి సమర్పించిన వెండి కదండం అక్కడే వేలం వేయగా కాంగ్రెస్ భక్తుడని పేర్గాంచిన కడియాల నారాయణ పాడుకొన్నారు. హోటల్ ప్రొప్రయిటరు చంద్ర, నాయరు... వస్తువులేమో యానాదుల సాయంతో బ్రాహ్మలచే తయారు చేయబడేవి. హోటలు ఓపెన్ చేసింది మహమ్మదీయోత్తముడు. హిందూ సనాతనులారా! మీరంతా వెళ్లి యథోచితం మెక్కి రాండయా... అప్పులు బెట్టకుండా!

#### వరగలి డాక్టరు

పైసాలేని దరిద్రులకు మందులేదు, మాకు లేదు. అబ్బా! కస్సని పైనబడతాడండీ! రోగులు డాక్టరు వద్దకు పోవడమే మానుకున్నారు. ఎందుకండీ ఈ ఆస్పత్రి?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

25-8-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు

#### డాక్టర్ గోపాలరెడ్డి

కేంద్ర మంత్రి డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి గారు 23వ తేదీ ఉదయం ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరుకు వచ్చి, నిన్న జరిగిన ఏ.సి.కుమారుని పెండ్లికి మొన్ననే రాజుపాళెంలో హాజరు వేసుకొని; పత్నీవియోగ దుఃఖంలో వున్న మేనకూరు గోపాలకృష్ణారెడ్డి గారిని విచారించి; 24వ తేదీ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు పోయిరి.

#### నాటక రచయితకు, నటునికి సన్మానం

నెల్లూరు ప్రాంత పల్లెసీమల వ్యవహారిక మాటల సజీవ చిత్రణంగా, సున్నిత హాస్యస్ఫోరకంగా, పవిత్ర వైవాహిక ప్రబోధితంగా రసజ్ఞుల మన్ననలను పొందిన 'తుపాను' నాటకకర్త పులిగుండ్ల రామకృష్ణయ్య గారిని; తుపానులోని రాఘవరెడ్డి పాత్రధారిగా ప్రేక్షకుల మనఃఫలకాలపై శాశ్వత ముద్రవేసిన సుప్రసిద్ధ స్టేజి, చలన చిత్ర నటుడు గాడేపల్లి రామయ్యగారిని నెల్లూరు రినైజాన్స్ ఆర్టిస్టు వారు 19వ తేదీ ఘనంగా సన్మానించారు. ఈ సన్మానసభకు పోలీసు సూపరింటెండెంట్ ఎం.వి.రంగయ్యనాయుడు గారు అధ్యక్షత వహించారు. ఈ సందర్భంలో విఆర్‌కాలేజి ఆంధ్ర భాషా శాఖాధిపతి పోలూరి హనుమజ్జానకి రామశర్మ గారు ఉపన్యసిస్తూ రామకృష్ణయ్య గారి నాటక రచనా రమణీయకతను, రామయ్య గారి నటనా వైదగ్ధతను గూర్చి ప్రశంసించారు. సన్మాన గ్రహీతలు ఉచితరీతి కృతజ్ఞత వెల్లడించారు. సర్వేపల్లి సుబ్రహ్మణ్యం వందన సమర్పణం చేశారు. సన్మానాంతరం 'తుపాను' ప్రదర్శించబడింది.

# నెల్లూరు ముచ్చట్లు

## అధికారులు పెరిగారు – నేరాలు తగ్గడం లేదు!

నెల్లూరు నగర పరిధిలోని అన్ని పోలీస్‌స్టేషన్లలో అధికారులు, సిబ్బంది సంఖ్య పెరిగినా నేరాలు – ఘోరాలు ఏ మాత్రం తగ్గడం లేదు. నగర డిఎస్పీ పోస్టు ఖాళీగా వున్నా, లా అండ్ ఆర్డర్ చూడను సిఐలు ముగ్గురున్నారు. ఆరుగురు ఎస్‌ఐలు, వీరికి రెట్టింపు సంఖ్యలో ఎఎస్‌ఐలు, హెడ్ కానిస్టేబుళ్లు, కానిస్టేబుళ్లు వున్నారు. నేర పరిశోధన విభాగానికి పై సంఖ్యకు ఏమాత్రం తగ్గని రీతిలో సిబ్బంది వున్నారు. అయినా నగరంలో ప్రతినిత్యం దొంగతనాలు, ఈవ్‌టీజింగ్‌లు, గొడవలు ఏమాత్రం తగ్గడం లేదు. బాలాజీనగర్ ప్రాంతంలో మహిళలు, విద్యార్థినులు ఇళ్ల నుంచి బయటకు రాలేనంతగా దొంగలు తమ దొంగతనాలతో భయపెట్టేవారు. ఎస్పీ ఈ ప్రాంతంలో దొంగతనాల అదుపు చేయను ప్రత్యేక పార్టీని ఏర్పాటుచేసినా దొంగలను పట్టలేకపోయారు. సిసిఎస్ సిఐగా బాధ్యతలు స్వీకరించిన సురేష్‌కుమార్‌కు ఈ సీటుపై అవగాహన లేదు. నగరంలో గొడవలు ఎంత శృతిమించి పోయాయంటే విఐపిలు, ముఖ్య కుటుంబీకులపై కూడా కొందరు దాడులకు తెగబడుతున్నారు. నగరంలో శాంతి భద్రతల పరిస్థితులు అదుపులో తేను ఎస్పీ ఓ కార్యాచరణను రూపొందించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## కృష్ణునికి కరేపాకు రైస్!

రోజులు మారాయి. భగవంతునికి నివేదించే ప్రసాదాలు కొత్త రూపు దిద్దుకొంటున్నాయి. కృష్ణాష్టమిని పురస్కరించుకొని పాలు, వెన్న, మీగడ, తత్సంబంధిత ఉత్పత్తులతో ప్రసాదాలు నివేదిస్తారు. కానీ నెల్లూరు వేణుగోపాల స్వామికి కృష్ణాష్టమిని పురస్కరించుకొని నివేదించిన ప్రసాదంలో కరివేపాకు రైస్‌తోపాటు కేసరి పొంగలి ప్రత్యక్షమయ్యి ఆశ్చర్యపరిచాయి. ఆ రోజుల్లో కుచేలుడు పెట్టిన అటుకులు తినే కృష్ణులు లేకుండా పోలేదు. ఆధునిక ధర్మకర్తలు ప్రసాదాల మెనూ మార్చారంతే!



## పెరిగిన ధరలు

లారీల సమ్మె మొదలైన మరుసటి రోజు నుంచే నెల్లూరు కిరాణా వర్తకులు ఎర్రగడ్డలు, వంటనూనెల రేట్లు పెంచి పారేశారు. కిలో పది రూపాయలకు దొరుకుతుండిన ఎర్రగడ్డలు ఒక్కసారిగా ఇరవై రూపాయలయ్యాయి. డెబ్బై రూపాయలకు దొరుకుతుండిన సన్‌ఫ్లవర్ ఆయిల్ 80 రూపాయలు చేశారు. వంటలో అతి ముఖ్యమైన వస్తువుల ధరల పెంపకంపై విచారించే తీరిక జిల్లా పౌర సరఫరాల శాఖాధికారికి లేనట్లుంది.

## కమ్యూనిస్టులే నీతిమంతులు!

దేశంలో కమ్యూనిస్టు పార్టీలు మినహా మిగతా పార్టీలన్నీ అవినీతి ఊబిలో చిక్కుకుపోయి వున్నాయని సిపిఐ రాష్ట్ర కార్యదర్శి కె.నారాయణ చెప్పారు. పార్టీ అనుబంధ విభాగం ఎఐవైఎఫ్ రాష్ట్ర స్థాయి శిక్షణా తరగతుల ప్రారంభానికి నెల్లూరు విచ్చేసిన ఆయన మాట్లాడారు. దేశంలో అద్భుత వనరులు, మేధావులున్నారు. కానీ సైనికుల ఇళ్లను, లక్షల కోట్లు భోంచేసే నేతలున్నారు. అవినీతిపై సమరం చేస్తున్న అన్నా హజారేను దేశ ద్రోహులుండే తీహార్ జైలులో నిర్భందించటమేమిటన్నారు. తిండైనా పెట్టండి, ఉద్యోగమైనా ఇవ్వండన్న నినాదంతో యువత ప్రభుత్వంపై తిరగబడాలని నారాయణ పిలుపిచ్చారు.

## వెంకయ్యానాయుడు నెల్లూరులో పోటీచేయాలి

భారతీయ జనతా పార్టీ అగ్రనేత ముప్పవరపు వెంకయ్యానాయుడు నెల్లూరు లోక్‌సభ స్థానం నుంచి పోటీచేయాలని ఆ పార్టీ మరో అగ్రనేత ఎల్.కె.అద్వానీ సలహా ఇచ్చారు. స్వర్ణభారత్ ట్రస్ట్ దశమ వార్షికోత్సవ వేడుకల్లో పాల్గొనను వచ్చిన అద్వానీ ఈ సూచన చేశారు. తాను ప్రత్యక్ష ఎన్నికల్లో పోటీచేయనని ఇదివరకే వెంకయ్యానాయుడు ప్రకటించి వున్నారు. మరి ఆయన గురువు అద్వానీ ఇచ్చిన సూచనపై ఏం నిర్ణయం తీసుకొంటారన్నది ముమ్ముందు తెలుస్తుంది.



## అద్వానీకి భారీబందోబస్తు

స్వర్ణభారత్ దశమ వార్షికోత్సవం, బిజెపి కార్యకర్తల సమావేశంలో పాల్గొనను నెల్లూరు వచ్చిన లాల్ క్రిష్ణ అద్వానీ పర్యటనను పురస్కరించుకొని భారీ పోలీసు బందోబస్తు ఏర్పాటు చేశారు. బ్లాక్ క్యాట్ కమెండోలు మొదటి వలయంలో వుండగా రెండో వలయంలో డిఎస్పీ, సిఐల స్థాయి అధికారులున్నారు. మూడో వలయంలో మఫ్టీలో పోలీసులు నిలబడ్డారు. కార్యకర్తల సమావేశానికి అద్వానీ కస్తూరిదేవి గార్డన్‌లోనికి రాను కస్తూరిబా కళాక్షేత్రం గోడ కూల్చి ప్రత్యేక ఏర్పాటు చేశారు. ఆయన ఈ సభ నుంచి మాట్లాడి వెళ్లేవరకు పోలీసాఫీసు మార్గంలో ట్రాఫిక్‌ను అనుమతించలేదు. కార్యకర్తలు క్రమశిక్షణగా మసలుకోవడంతో చిన్నపాటి అపశృతి కూడా లేకుండా సమావేశం జరిగిపోయింది.

## ఎసి మార్కెట్ తీరుపై జెసి ఆగ్రహం

నెల్లూరు ఎసి కూరగాయ మార్కెట్‌లో పరిస్థితులు అధ్వాన్నంగా వుండడంపై జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ అగ్గిమీద గుగ్గిలమయ్యారు. 22వ తేది ఉదయం మార్కెట్‌ను సందర్శించిన జాయింట్ కలెక్టర్ అక్కడి పారిశుద్ధ్య పరిస్థితులపై తీవ్రంగా మండిపడ్డారు. సాయంత్రం మళ్లీ వస్తాను పరిస్థితుల్లో మార్పు రావాలని ప్రకటించి వెళ్లినా ఆయన రాడని ఎవరూ పట్టించుకోలేదు. పొద్దుపొయ్యాక మళ్లీ వచ్చిన జెసి కోటి 76 లక్షల రూపాయల నిధులున్నాయి. రాష్ట్రంలో ఇంత చెత్తగా మరో కూరగాయల మార్కెట్ లేదు. పరిస్థితులు మెరుగుపర్చడం చేతకాకుంటే తాళాలు వేసి తనకివ్వమని మార్కెటింగ్ శాఖాధికారులను కోరారు. మార్కెట్‌లో చెత్త నిర్ణీత స్థలంలో వేయాలని, ఎలక్ట్రానిక్ తక్కెడలు వాడాలని అలా చేయని వారి నుంచి ఐదు వేలరూపాయలు జరిమానాగా వసూలు చేయాలని ఆదేశించారు. నెలకొకసారి ఉన్నతాధికారులు మార్కెట్‌ను సందర్శిస్తే గానీ ఇక్కడ పరిస్థితులు మెరుగుపడవు.

## వక్ఫ్‌బోర్డు స్థలానికి టోకన్లు!

నెల్లూరు పెద్దపోస్టాఫీసు సందులోని జుమ్మా మసీదుకు పరమేశ్వరినగర్‌ను ఆనుకొని 13 1/2 ఎకరాల పొలం వుంది. ఎకరా నాలుగు కోట్ల రూపాయలు విలువ పలికే ఈ భూమిని గతంలో ఖుద్దూస్‌నగర్ ప్రాంత స్థలాన్ని అమ్మిన రీతిలోనే అమ్మేయను ఇద్దరు మైనార్టీ నాయకులు చక్రం తిప్పుతున్నారు. ఒక్కొక్క ప్లాటును తొమ్మిది అంకణాల చొప్పున మసీదు ముతవలికి(సంరక్షకుడు) 99 సంవత్సరాలకు లీజు ఇస్తున్నట్లు పత్రాలు తయారవుతున్నాయి. ఈ స్థలానికి ఒక్కొక్కరి వద్ద రెండు లక్షల రూపాయలు స్వీకరించి టోకన్లు ఇస్తున్నారు. ఈ టోకన్ల కోసం వన్‌టౌన్ ప్రాంతమంతా ఎగబడుతున్నారు. ఈ ప్రాంతంలో అంకణం 20వేల రూపాయల కూడా లెక్కన వచ్చే అవకాశం లేనందున నిశ్శబ్దంగా టోకన్ల అమ్మకం జరిగిపోతుంది. టోకన్లను అమ్ముతున్న ఇద్దరు మైనార్టీ నేతలు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి సహకారంతోనే ఈ స్థలాన్ని లీజుకివ్వను వక్ఫ్‌బోర్డు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చిందంటున్నారు.

మసీదు స్థలాన్ని అమ్మే హక్కు ముతవలికి లేదు. లీజు ముసుగులో చేతులు మార్చే ప్రయత్నంలో చోటా నేతల నుంచి పెద్ద నేతలు, అధికారులకు భాగముందన్న చర్చ జరుగుతుంది. నగరంలో వందల కోట్ల రూపాయలు విలువచేసే మసీదులు, దర్గాలు, వక్ఫ్‌బోర్డు స్థలాలను ఇప్పటికే దురాక్రమించారు. ముక్కీమూలిగి దురాక్రమణదారుల కళ్లపడకుండా వున్న ఈ స్థలాన్ని రాజకీయ రాబందుల పాలవకుండా రక్షించాల్సిన బాధ్యత జిల్లా కలెక్టర్ పైన వుంది.

## పద్మావతమ్మకు బంగారు వడ్డాణం!

నెల్లూరు రత్నం విద్యాసంస్థల అధినేత కెవిరత్నం తిరుచానూరులోని పద్మావతి అమ్మవారికి బంగారు వడ్డాణాన్ని తన సతీమణి పద్మావతితో కలసి సమర్పించారు. 150 గ్రాముల బరువున్న ఈ వడ్డాణం విలువ నాలుగున్నర లక్షల రూపాయల పైమాటే. వడ్డాణంపై రంగు రాళ్లతో అమ్మవారి ప్రతిమను ప్రత్యేకంగా చెక్కించారు. ప్రత్యేక ఉత్సవాల సమయంలో అమ్మవారికి ఈ వడ్డాణాన్ని అలంకరించమని దాత ఆలయ అధికారులను కోరారు.



## సరస్వతి నిధికి విరాళం

ఆంధ్రప్రదేశ్ పంచాయితీ అధికారులు, ఉద్యోగుల సంఘం తరపున జిల్లా

కొరవ 14వ పేజీలో

# స్వర్ణభారత్ ట్రస్ట్ దశమ వార్షికోత్సవం!

**ఘనంగా నిర్వహించిన వెంకయ్యనాయుడు**

గ్రామీణ ప్రాంతంలోని ప్రజలకు విద్య, వైద్య సదుపాయాలు అందించాలన్న లక్ష్యంతో బిజెపి సీనియర్ నేత ముప్పవరపు వెంకయ్యనాయుడు వెంకటాచలంలో స్వర్ణభారత్‌ట్రస్టును నెలకొల్పి పదేళ్ల పూర్తయిన సందర్భంగా దశమ వార్షికోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. బిజెపి అగ్రనేత లాల్‌కృష్ణ అద్వానీ ముఖ్య అతిథిగా ఈ కార్యక్రమానికి హాజరు కావడంతో మరింత నిండుతనం చేకూరింది. జ్యోతి ప్రజ్వలన చేసిన అనంతరం అద్వానీ ప్రసంగిస్తూ రాజకీయాలు నిర్మాణాత్మకంగా వుండాలన్నారు. అధికారంలో వున్నా లేకపోయినా రాజకీయాల్లో వుండేవారు, రాజకీయ పార్టీలు ప్రజా సంక్షేమం కోసం పాటుపడాలన్నారు. అలాంటి సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ స్వర్ణభారత్ ట్రస్టు ప్రత్యేకతను చాటుకొంటుందన్నారు. వెంకయ్యనాయుడు చేస్తున్న సేవా కార్యక్రమాలను చూస్తుంటే సంతోషంగా వుందన్నారు. 1980లో వాజ్‌పాయ్ చేసిన ప్రసంగం గుర్తుకు వస్తున్నదన్న అద్వానీ వెంకయ్యనాయుడికి గ్రామాలంటే ఎంతో మక్కువని, ఆ ప్రేమతోనే కేంద్రంలో ఎన్‌డిఏ ప్రభుత్వంలో గ్రామీణాభివృద్ధి శాఖను చేపట్టాడని గుర్తు చేశారు. ఆయన్ను ఆదర్శంగా తీసుకొని మరికొందరు ఇటువంటి ట్రస్టులు నెలకొల్పాలన్నారు. లోక్‌సత్తా అధ్యక్షుడు జయప్రకాష్ నారాయణ్ మాట్లాడుతూ రాజకీయాల్లో వుంటూ సేవా కార్యక్రమాలు చేపట్టే వ్యక్తులు దేశంలో వేళ్లమీద లెక్కపెట్టగలిగే సంఖ్యలో వుంటారని వారిలో వెంకయ్యనాయుడు ఒకరని ప్రశంసించారు. పరిశ్రమలతోపాటు వ్యవసాయరంగాన్ని ప్రోత్సహించాలని, రైతులకు అండగా నిలిస్తే దేశం మరింతగా అభివృద్ధి చెందుతుందన్నారు. కార్యక్రమ నిర్వాహకుడు వెంకయ్యనాయుడు స్వర్ణభారత్ ట్రస్టు స్థాపన గురించి వివరించారు. ట్రస్టు ఏర్పాటు తన స్వప్నమని చెప్పిన ఆయన విద్య, వైద్యంతోపాటు ఉపాధి రంగాల్లో శిక్షణనిస్తున్నట్లు తెలిపారు. సేవా కార్యక్రమాలను విజయవాడ, విశాఖల్లో కూడా విస్తరించనున్నట్లు ప్రకటించారు. సాయంసంధ్య వేళ ఈ కార్యక్రమానికి విఖ్యాత సంగీత దర్శకుడు మణిశర్మ ఆధ్వర్యంలో వర్ధమాన గాయనీగాయకులు హేమచంద్ర, మల్లిఖార్జున, గీతా మాధురి, మాళవికలు వీనుల విందైన పాటలు తోడవడంతో ఆహ్లాదకరంగా సాగింది. ఈ కార్యక్రమంలో ట్రస్టు ఛైర్మన్ మాగంటి రాజేంద్రప్రసాద్, ట్రస్టీ దీప, ప్రముఖ పారిశ్రామిక వేత్త గ్రంధి మల్లిఖార్జునరావు తదితరులు పాల్గొన్నారు.



స్వర్ణభారత్ ట్రస్ట్ సభలో మాట్లాడుతున్న ఎల్.కె.అద్వానీ. ప్రక్కన వెంకయ్యనాయుడు.

## చవితి చందాల దందా!

• ఇబ్బంది పడుతున్న జనం



నగరంలో వినాయకచవితి పండుగను పురస్కరించుకొని విగ్రహాల ఏర్పాటు పేరుతో చందాల దందాలు మొదలయ్యాయి. ప్రతి ఏడాది పోటాపోటీగా వివిధ సెంటర్లలో వినాయక విగ్రహాలను నెలకొల్పి వారం రోజులపాటు చవితి ఉత్సవాలను నిర్వహిస్తుంటారు. ఒకటి రెండు సెంటర్లలో స్థానికంగా వుండే పెద్దలు, వ్యాపారస్థులు దగ్గరుండి కార్యక్రమాన్ని చక్కగా నిర్వహిస్తుండగా, మిగతా చోట్ల మాత్రం ఈ కార్యక్రమం నిర్వాహకులకు జేబులు నింపుకొనే దిగా మారి చందాల వసూళ్ల దందాలుగా మారాయి. తమ శక్తిమేర భక్తులు ఇచ్చినంత చందాలు తీసుకొనే రోజులు పోయాయి. వినాయక భక్తుల ముసుగులో కొందరు అల్లరచిల్లరగా తిరిగేవారు ఇళ్లకు వెళ్లి అడిగినంత ఇవ్వాల్సిందేనని బలవంత పెడుతుండడంతో చందాల పేరు చెప్తేనే ప్రజలు హడలి పోతున్నారు. కొన్ని చోట్ల రౌడీమూకలు భక్తుల ముసుగు వేసుకొని దీనిని ఆదాయ వనరుగా మలచుకోవడంతో వీరి ఆగడాలు అధికం అవుతున్నాయి. పదిమందిని వెంటేసుకొని రసీదు పుస్తకాలు చేతపట్టుకొని ఎంత చందా ఇవ్వాలో వీరే వ్రాసి వ్యాపారస్థులు, గృహ యజమానుల నుంచి బలవంతంగా వసూళ్లకు పాల్పడుతుండడంతో ఈ వ్యవహారం ఎవరికీ చెప్పుకోలేక, రౌడీమూకలు ఏమి చేస్తారోనని భయపడి అడిగినంత ముట్టజెప్పి గమ్మునుంటున్నారు. సాంప్రదాయ బద్ధంగా నిర్వహించే వారికి కూడా ఇలాంటి రౌడీ గ్యాంగుల కారణంగా అప్రతిష్ఠ నెలకొంటుంది. ఇంత బాహాటంగా చవితి ఉత్సవాల పేరిట చందాలు వసూలు చేస్తున్నా పోలీసు పట్టించుకోక పోవడం విమర్శలకు తావిస్తోంది. ఇక చవితినాడు తాగి తందనాలాడే అల్లరి మూకల పైనైనా పోలీసులు నిఘా పెడతారో లేదో చూడాలి.

## ఆనం - మేకపాటిల మధ్య మాటల తూటాలు!

**ఒకరి చరిత్ర మరొకరు బట్టబయలు చేస్తున్నారు**

వైఎస్‌జగన్ వ్యాపారాలపై సిబిఐ దర్యాప్తు జరుగుతున్న తరుణంలో ఈ విషయమై రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి, మేకపాటి సోదరుల మధ్య మాటల తూటాలు పేలుతున్నాయి. మేకపాటి సోదరుల వద్ద జగన్ పెట్టుబడులున్నాయంటూ వివేకా విమర్శించడంపై ఉదయగిరి శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి తీవ్రంగా స్పందించారు. అవినీతి అక్రమార్జనతో కోట్లకు పడగలెత్తిన ఆనం సోదరులకు తమను విమర్శించే అర్హత లేదన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చలువతో మంత్రి పదవి పొంది కోట్లు కొల్లగొట్టారన్నారు. మెట్రో రైలు ప్రాజెక్టులో కోట్లు దిగమింగాడు ఆనం రామనారాయణరెడ్డి. ఆయన సోదరుడు వివేకానందరెడ్డి విఆర్ కాలేజీ, వేణుగోపాలస్వామి గుడి ఆస్తులను దిగమింగుతున్నాడని ఆరోపించారు. భానుశ్రీకి మేయర్ పదవి ఇప్పించుకొనేందుకు వైఎస్ కాళ్లు పట్టుకొన్న వివేకా నేడు గతం మరచి ప్రవరిస్తున్నాడన్నారు. జగన్ వంటి కొడుకు ఏ తండ్రికి పుట్టకూడదని రామనారాయణరెడ్డి చేసిన వ్యాఖ్యలపై స్పందిస్తూ మంత్రి కొడుకు సంగతేంటని డిగ్రీ పరీక్షలు వ్రాయలేక ఇతరుల చేత వ్రాయించిన అలాంటి కొడుకుని కనాలా అని ప్రశ్నించాడు. ఆనం సోదరుల వ్యవహారశైలిని ప్రజలు చీత్కరించుకొంటున్నారని త్వరలో వారికి గుణపాఠం చెప్తారన్నారు. మేము మెట్ట పల్లెల్లో పుట్టి, కష్టపడి పెరిగామని, మా అన్న రాజమోహన్‌రెడ్డి వరంగల్ ఆర్ఇసి నుంచి ఇంజనీరింగ్ పట్టా పొందాడన్నారు. వ్యాపారాలు చేసి సంపాదించామే తప్ప ఆనం వారిలాగా సంతకాలు పెట్టి కోట్లు సంపాదించలేదన్నారు. దీనిపై బహిరంగ విచారణకు సిద్ధపడాలని సవాల్ విసిరారు. ఎసి సెంటర్‌లో తేల్చుకుందాం రమ్మని తీవ్రంగా మాట్లాడడంతో ఇరువురి మధ్య విమర్శలస్థాయి పదునెక్కింది.

• వాహన చోదకులకు

## ఇక కష్టాలే!

• నిబంధనల పేరిట రవాణా శాఖ బాదుడు

రవాణా శాఖకు రాష్ట్ర ప్రభుత్వం మరిన్ని అధికారాలు కట్టబెడుతూ ఉత్తర్వులు జారీ చేసింది. వాహనాల తనిఖీకి సంబంధించి కొత్త సర్క్యులర్ జారీ చేసింది. గతంలో వున్న నిబంధనలను సవరించి కఠిన తరమైన నిబంధనలు ఈ దఫా ప్రతిపాదించారు. లైసెన్స్, ఇన్సూరెన్స్, పొల్యూషన్, రిజిస్ట్రేషన్ ఏ ఒక్కటి లేకపోయినా ఇప్పటివరకు ఎంతో కొంత నగదును జరిమానాగా విధించి వసూలు చేసేవారు. తాజాగా జారీ చేసిన సర్క్యులర్‌లో వాహన రిజిస్ట్రేషన్, డ్రైవింగ్ లైసెన్స్, ఇన్సూరెన్స్, పొల్యూషన్ ధృవీకరణ పత్రాలు లేకపోతే భారీ జరిమానా చెల్లించాల్సి వుంటుంది. రవాణాశాఖ అధికారులతోపాటు ట్రాఫిక్ ఎస్ఐలు సైతం నిబంధనలు పాటించని వాహన చోదకులకు భారీ జరిమానా విధిస్తారు. ఇప్పటి వరకు వాహనాలకు సంబంధించి ఏ పత్రాలు చూపకపోయినా 200 రూపాయల జరిమానా వసూలు చేసేవారు. ఇక నుంచి వెయ్యి రూపాయల నుంచి ఐదువేల రూపాయల వరకు జరిమానా వసూలుచేసే అవకాశం వుంది. ద్విచక్ర వాహనాలతోపాటు ఇతర వాహనాలను నడిపేవారు అన్ని ధృవీకరణ పత్రాలు తమతోపాటు బండిలో ఉంచుకోకపోతే ఇక ఇబ్బందులే...

## నవ్వుకు నిర్వచనం పద్మనాభం

జయంతి సభలో జ్యోతి వెలిగిస్తున్న అమరావతి కృష్ణారెడ్డి.

నవ్వుకు నిర్వచనం నటుడు పద్మనాభం అని రాష్ట్ర హోటళ్ల అసోసియేషన్ ఉపాధ్యక్షుడు అమరావతి కృష్ణారెడ్డి అన్నారు. అమరావతి హోటల్‌లో హరివిల్లు క్రియేషన్స్ ఏర్పాటుచేసిన పద్మనాభం జయంతి వేడుకల్లో ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. హాస్యనటుడిగా, కథానాయకుడిగా, నిర్మాతగా, దర్శకునిగా పలు పాత్రలు పోషించిన పద్మనాభంకు నెల్లూరుతో వున్న అనుబంధాన్ని గుర్తు చేశారు. ఆయన తీసిన మర్యాదరామన్న చిత్రంతో ఎస్పీ బాలసుబ్రహ్మణ్యంను సినిమాకు పరిచయం చేసిన ఘనత ఆయనకు దక్కిందన్నారు. ఈ కార్యక్రమంలో హరిబాబు, డి.కామేశ్వరరావు, కుమార్, శంకర్ తదితరులు పాల్గొన్నారు.

# బోగోలులో నాటుసారా ప్రవాహం!

సారా వ్యతిరేక ఉద్యమానికి ఒకప్పుడు నెల్లూరుజిల్లా కేంద్ర బిందువు. మన జిల్లాలో ప్రారంభమైన అక్షరాస్యత ఉద్యమ స్ఫూర్తితో సారా ఉద్యమానికి శ్రీకారం చుట్టారు నారీ మణులు. మారుమూల గ్రామం దూబగుంటలో ప్రారంభమైన సారా ఉద్యమం రాష్ట్రవ్యాప్తంగా ఊపందుకుని ప్రజలలో ఉద్యమ స్ఫూర్తిని రగిలించింది. ఉవ్వెత్తున లేచిన ఉద్యమానికి రాష్ట్రప్రభుత్వం దిగిరాక తప్పలేదు. ప్రభుత్వం నుంచి అనేక ఇబ్బందులు ఎదురైనా ప్రజలు వెనుకంజవేయలేదు. ప్రజల్లో వచ్చిన చైతన్యాన్ని గుర్తించిన అప్పటి ప్రభుత్వం రాష్ట్రంలో సారా నిషేధించక తప్పలేదు. అటువంటి ఉద్యమాల పురిటిగడ్డగా పేరొందిన నెల్లూరు జిల్లాలో తిరిగి నాటుసారా తయారీ అవుతుంది.

## రహస్యంగా తయారీ

బోగోలు మండలం నాటుసారా తయారీకి కేంద్రబిందువుగా మారింది. ఎక్సైజ్ పోలీసుల నిర్లక్ష్యం, పోలీసుల నిఘా వైఫల్యం కారణంగా సారా బట్టీలు ఏర్పాటు జరుగుతున్నాయి. ఈ మండలంలో సారా నిషేధం వున్న సమయంలో రహస్యంగా సారా తయారీ చేసి విక్రయించేవారు. అనేక దఫాలు ఎక్సైజ్ పోలీసులు దాడులు జరిపినా అసలు సూత్రధారులు మాత్రం తప్పించుకుని మిగిలినవారు పట్టుబడేవారు. గత నెలరోజుల నుంచి ఈ మండలంలో మారుమూల గ్రామాలలో బట్టీలను ఏర్పాటు చేసి నాటుసారా తయారు చేస్తున్నారు. సమీప గ్రామాల ప్రజలకు సారా తయారీ సమాచారం తెలిసినా బయటకు చెబితే ఏం జరుగుతుందోనన్న భయంతో మౌనంగా వుండిపోతున్నారు.

ఇక్కడ తయారు చేస్తున్న నాటుసారా ఈ ప్రాంతంలో అనేక మంది సేవిస్తుంటారు. తక్కువ ధరకు లభిస్తుండడంతో గ్రామీణప్రాంత ప్రజలు దీనిపై మొగ్గుచూపుతున్నారు. పోలీసులు, ఎక్సైజ్ పోలీసుల కళ్లుగప్పి ఇతర ప్రాంతాలకు తరలించి సొమ్ము చేసుకొంటున్నారు. నాటుసారా తయారీలో అధికశాతం మత్తు కల్గించే రసాయనాలు కలుపుతుంటారు. రసాయనాలు ఎక్కువ శాతం వినియోగిస్తే సేవించిన వారు అస్వస్థతకు గురికావడంతోపాటు ప్రాణాలు కోల్పోయే అవకాశం కూడా వుంటుందని వైద్యులు చెబుతున్నారు. నాటుసారా తయారీ కేంద్రాలపై నిఘా లేకపోవడం ఇందుకు కారణం.

బోగోలు మండలం కప్పరాళ్లతిప్పకు చెందిన కొందరు వ్యక్తులు ఒక ముఠాగా ఏర్పడి నాటుసారా తయారు చేస్తున్నారు. నేర ప్రవృత్తిగల వారు కావడం వలన ప్రజలు భయపడుతున్నారు.

> బోగోలు మండలంలోని కొన్ని గ్రామాల్లో విచ్చలవిడిగా నాటుసారా తయారీ జరుగుతోంది. ఈ విషయం ఎక్సైజ్, సివిల్ పోలీసులకు తెలిసినా పట్టీ పట్టనట్లు వ్యవహరించడం విమర్శలకు తావిస్తోంది.

## స్పందించని ఎక్సైజ్ శాఖ

నాటు సారా తయారు చేస్తున్న సమాచారం అందినప్పటికీ ఎక్సైజ్ పోలీసులు పెద్దగా స్పందించడం లేదన్న ఆరోపణలు వున్నాయి. సారా కాస్తున్న మారుమూల గ్రామాలకు వెళ్లాలంటే అధికారులు సైతం వెనుకంజ వేస్తున్నట్లు తెలుస్తుంది. బోగోలు ప్రాంతంలో నాటుసారా తయారీ కారణంగా మద్యం విక్రయాలు జరగడం లేదు. దీంతో మద్యం దుకాణదారులు తమ వ్యాపారాలు తగ్గుముఖం పట్టాయని ఆందోళన చెందుతున్నారు.

ఎక్సైజ్‌శాఖ నిర్లక్ష్యం వల్లనే నాటుసారా విచ్చలవిడిగా తయారు చేస్తున్నారని ప్రజలు విమర్శిస్తున్నారు. సారా ఉద్యమంలో అగ్రభాగాన నిలచిన జిల్లా మహిళలు నాటుసారా తయారీపై ఉద్యమించలేకపోతున్నారు. ఇప్పటికైనా ఎక్సైజ్ పోలీసులు స్పందించి నాటుసారా తయారు చేసి విక్రయిస్తున్న వారిపై కఠిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.



# వికలాంగుల పెన్షన్లు ఉన్నఫళంగా రద్దు!

రాష్ట్రప్రభుత్వం ఆర్థిక ఇబ్బందుల నుంచి గట్టెక్కాలని భావించిందో ఏమో తెలియదు గానీ వున్నఫళంగా వికలాంగుల పెన్షన్ల మంజూరులో కోత విధించింది. దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హయాంలో శాశ్వత అంగవైకల్యం గల వారితోపాటు నలభైశాతం అంగవైకల్యం వున్న వారికి వికలాంగుల కోటలో పెన్షన్ మంజూరు చేయడం జరిగింది. గత మూడు సంవత్సరాల నుంచి అందిస్తున్న పెన్షన్లను ఎటువంటి సమాచారం లేకుండానే ఈ నెల నుంచి నలభైశాతం అంగవైకల్యం గల వారికి నిలిపివేశారు అధికారులు. ప్రభుత్వం అందించే 500ల రూపాయల పెన్షన్ ఈనెల నుండి అందకపోవడంతో జిల్లావ్యాప్తంగా వికలాంగులు ఆందోళన చెందుతున్నారు.

> జిల్లాలో ఎనిమిదివేల మంది వికలాంగులకు పెన్షన్లు ఉన్నఫళంగా రద్దు చేశారు. దీనికి కారణం తెలియకపోవడం వల్ల మరో ఆసరాలేని వికలాంగులు తల్లడిల్లిపోతున్నారు.

అధికారులను ఈ విషయంపై ప్రశ్నిస్తే ప్రభుత్వం నుంచి పెన్షన్ రద్దు చేయమని ఉత్తర్వులు అందాయని సమాధానం చెబుతున్నారు. కొంతమంది ఎటువంటి అంగవైకల్యం లేకపోయినా నలభైశాతం వున్నట్లు ధృవీకరణపత్రాలు సమర్పించారని దీంతో ప్రభుత్వంపై అదనపు ఆర్థిక భారం పడినందున నలభై శాతం అంగవైకల్యం వున్నవారి పెన్షన్లు రద్దు చేసినట్లు ఉన్నతాధికారి ఒకరు చెప్పారు. ఎవరో తప్పుచేస్తే అందరిని బాధ్యులు చేస్తూ పెన్షన్ రద్దు చేయడం ఏమిటని వికలాంగులు ప్రశ్నిస్తున్నారు. పెన్షన్ మంజూరు చేసే సమయంలో పూర్తిగా విచారణ చేయాల్సిన బాధ్యత అధికారులదే.

వికలాంగులకు పెన్షన్లు మంజూరు చేసే సమయంలో రాజకీయ ఒత్తిళ్లకు లొంగిన అధికారులు ఇప్పుడు రద్దు చేయడంలో మతలబు ఏమిటో వారికే తెలియాలి. పెన్షన్ మంజూరు కోసం లబ్దిదారులు అనేక ఇక్కట్లు పడాల్సి వచ్చింది. ప్రతి నెల ఒకటవ తేదిన స్మార్టు కార్డుల ద్వారా పెన్షన్ అందిస్తుంటారు. స్మార్టు కార్డులు తీసుకొని మండల పరిషత్ కార్యాలయానికి వెళ్లిన వికలాంగులకు పెన్షన్ రద్దు చేశారని సిబ్బంది చెప్పడంతో షాక్ తినాల్సి వచ్చింది. జిల్లాలోని 46 మండలాల్లో దాదాపు 8వేల మందికి పెన్షన్లు రద్దు కాబడ్డాయి.

వికలాంగుల పెన్షన్లు రద్దు చేస్తూ ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వుల్లో కారణాలు కూడా పెద్దగా పేర్కొనలేదు. ప్రభుత్వం నుంచి ఉత్తర్వులను సమగ్రంగా పరిశీలించకుండానే అధికారులు నిర్ణయం తీసుకున్నారని వికలాంగులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులను రద్దు చేయాలని జిల్లావ్యాప్తంగా వికలాంగుల హక్కుల పోరాట సమితి ఆధ్వర్యంలో ఆందోళన, ధర్నాలు కొనసాగాయి. పెన్షన్ రద్దు చేయబడిన వికలాంగులు వినతి పత్రాలు చేతపట్టుకొని కలెక్టరేట్, మండల పరిషత్ కార్యాలయాల చుట్టూ ప్రదక్షణాలు చేస్తున్నారు. మండలస్థాయి అధికారులు తమ కార్యాలయానికి వస్తున్న వారికి ఏం సమాధానం చెప్పి పంపాలో తెలియక ఇబ్బంది పడుతున్నారు.

## పునర్విచారణ

పెన్షన్ రద్దు కాబడిన వికలాంగులు గతంలో సమర్పించిన దరఖాస్తులను పునర్విచారణ చేయాలని జిల్లా కలెక్టర్ నిర్ణయించారు. ఈమేరకు జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, మండల పరిషత్ అభివృద్ధి అధికారులను ఆదేశించారు. ఇందుకు ప్రత్యేకంగా ప్రొఫార్మాను రూపొందించారు. అధికారులు అందజేసిన ప్రొఫార్మాలో పెన్షన్ రద్దు కాబడిన వికలాంగులు పూర్తి వివరాలు నమోదు చేయాల్సి వుంటుంది. అవసరమైతే ప్రభుత్వ వైద్యుల చేత వైద్య పరీక్షలు నిర్వహించి ధృవీకరణ పత్రం అందజేస్తారు. ఈ విధానం ఏ మేరకు వికలాంగులకు లబ్ది చేకూరుస్తుందో వేచి చూడాలి.

## అధికారుల వివరణ

నలభై శాతం కంటే తక్కువ వైకల్యం వున్న వారికి పెన్షన్ నిలిపింది వాస్తవం. ప్రభుత్వ ఉత్తర్వుల మేరకు తక్కువ వైకల్యం వున్న వారి విషయమై మళ్లీ పునఃపరిశీలన చేసి పెన్షన్లు పునరుద్ధరించే చర్యలు తీసుకొంటామని డిఆర్‌డిఏ పిడి విజయచందర్ చెప్పారు.

# నెల్‌కాస్ట్‌కు 200 ఎకరాలు

**థర్మల్ విద్యుత్ కేంద్ర నిర్మాణానికి భూమి కేటాయింపు**

తోటపల్లి గూడూరు మండలంలో నిర్మించనున్న నెల్‌కాస్ట్ థర్మల్ పవర్ ప్రాజెక్టు కోసం 200 ఎకరాలను కేటాయించేందుకు రాష్ట్ర మంత్రి వర్గం తీర్మానించింది. జిల్లాలో థర్మల్ విద్యుత్ కేంద్రాల ఏర్పాటుపై పెద్ద ఎత్తున ఆందోళన చేపడుతున్న తరుణంలో భూకేటాయింపు జరపడం విమర్శలకు తావిస్తోంది. చిల్లకూరు మండలంలోని అంకులపాటూరు వద్ద నిర్మించనున్న 350 మెగావాట్ల విఎస్ ఎఫ్‌పై ప్రజాభిప్రాయ సేకరణ సభ వాయిదా వేశారు. థర్మల్ వ్యతిరేక పోరాట కమిటి ఆందోళనలతో రిలయన్స్ థర్మల్‌ప్రాజెక్టు పనులు నిలిచిపోయాయి. ఈ పరిస్థితుల్లో ప్రభుత్వం ఉన్నట్లుండి నెల్‌కాస్ట్‌కు ఈదూరు బిట్– 2లో 130 ఎకరాలు, అనంతపురంలో 62ఎకరాల 73సెంట్లు కేటాయించింది. ప్రభుత్వ నిర్ణయంపై వివిధ ప్రజాసంఘాలు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నాయి. ప్రజల బాగోగులు పట్టించుకోకుండా పరిశ్రమల యజమానులకు ప్రభుత్వం వత్తాసు పలుకుతోందని విమర్శిస్తున్నారు.

# ఎడారిగా మారుతున్న పులికాట్

● ముఖద్వారాలు పూడిపోయాయి

ప్రపంచంలోనే అతిపెద్ద ఉప్పునీటి సరస్సుగా పేరు గాంచిన పులికాట్ సరస్సు ఎడారిగా మారుతోంది. ముఖద్వారాలు ఇసుకతో పూడిపోవడం, ఎగువ ప్రాంతాల నుంచి నీరు రాకపోవడంతో సరస్సు ఎండిపోతుంది. దీని ప్రభావం పులికాట్‌ను నమ్ముకొని జీవనం సాగిస్తున్న మత్స్యకారుల జీవితంపై పడుతోంది. ఆంధ్రా, తమిళనాడు రాష్ట్రాల్లో బంగాళాఖాతాన్ని ఆనుకొని 1000 చదరపు కిలోమీటర్లు విస్తరించి వుంది పులికాట్ సరస్సు. అటు షార్, ఇటు ప్రకృతి సోయగాలు, విదేశీ విహంగాల కేంద్రంగా పేరు బడ్డ ఈ ప్రాంతం నేడు ఎడారిగా మారుతుండడంతో పలువురు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దీనికి ప్రధాన కారణం సరస్సు ముఖద్వారాలు పూడిపోవడం. రాష్ట్ర పరిధిలోకి వచ్చే రాయదొరువు, కొండూరు ప్రాంతాల్లోని ముఖద్వారాలు, తమిళనాడు పరిధిలోని పలవరికాడు వద్ద ఇసుక మేట వేసిన కారణంగా ముఖద్వారాలు పూడిపోయాయి. దీంతో ఆటుపోట్లు లేక సరస్సులోకి నీరు రావడం నిలిచిపోయింది. పులికాట్ ఎగువ ప్రాంతాలైన కాళంగి, నెర్రి, పాములకాలువలు, స్వర్ణముఖి నది నుంచి నీరు చేరడం లేదు. బివిపాళెం,



నీళ్లు తగ్గిన పులికాట్ సరస్సు

శ్రీహరికోట, సూళ్ళూరుపేట, దొరవారిసత్రం, చిట్టమూరు, వాకాడు, తడ మండలాల పరిధిలో సరస్సు ఎండిపోయి ఎడారిని తలపిస్తోంది. చుట్టుప్రక్కల 80గ్రామాల్లో వుండే వేలాది మంది మత్స్యకారులు ఈ కారణంగా వేటలేక జీవనోపాధి కోల్పోయారు. దీనితోపాటు ఆక్రమణలు పెరిగిపోతున్నాయి. ప్రతి ఏడాది సూళ్లూరుపేటలో ఫ్లెమింగో ఫెస్టివల్‌ను అట్టహాసంగా నిర్వహించి చేతులు దులుపుకోవడం తప్ప పాలకులు, అధికారులు ఈ సరస్సు గురించి పట్టించుకోక పోతుండడంతో పులికాట్ మనుగడ ప్రశ్నార్థకమైంది.

# జనం లేని గ్రామాలు

**వెంకటగిరిలో విచిత్రం.**

వెంకటగిరి నియోజకవర్గంలో పలు గ్రామాలు రికార్డుల్లో వున్నాయి తప్ప అక్కడ జనం లేరు. జనావాసాలు లేని ఇలాంటి గ్రామాలు ఈ ప్రాంతంలో అధికంగా వున్నాయి. గతంలో రాజుల కాలంలో కవులు, పండితులకు వారి ప్రతిభకు మెచ్చి అగ్రహారాలుగా కొన్నింటిని దానం క్రింద ఇచ్చారు. అలాంటి ఊర్లు నేడు జనావాసాలు లేని గ్రామాలుగా రెవెన్యూ రికార్డుల్లో కొనసాగుతుండడం విశేషం. వెంకటగిరి మండలంలో గతంలో పంచాయితీ కేంద్రమైన చెవిరెడ్డిపల్లి గ్రామం ఈ కోవకు చెందినదే. ఆ పంచాయితీ ఇప్పుడు వెంకటగిరి మునిసిపాల్టీలో విలీనం అయ్యింది. డక్కిలి మండలంలో 50 రెవెన్యూ గ్రామాలు వున్నాయి. వాటిలో ఎనిమిది ఊర్లలో జనం లేరు. రెవెన్యూ రికార్డుల ప్రకారం మాత్రం ఆ ఎనిమిది ఊర్లు కొనసాగుతున్నాయి. కొత్త చెరువు, చెర్లోపల్లి, నమశివాయపురం, దత్తానగరం, వెదురుగుంట, గొల్లవారిగుంట, స్వర్ణయాచసముద్రం, నూతనాల చెరువు కండ్రిగ గ్రామాలు ఇలాంటివే. రాచరిక పాలనలో ఈ గ్రామాలు ఏర్పాటై కాలక్రమేణా ప్రక్క గ్రామాల్లో విలీనం అయ్యాయి. రెవెన్యూశాఖ లెక్కలు మాత్రం ఈ గ్రామల పేర్లతోనే జరుగుతాయి. రెవెన్యూ మాత్రం సమీప పంచాయితీలకు చేరుతుంది. జనావాసంలేని గ్రామాలను రెవెన్యూ పరిభాషలో బేచర గ్రామాలంటారు. ఇలాంటివి కొనసాగుతుండడంతో విశేషంగా చెప్పుకోవాలి.

# మసీదు ప్రక్కన బ్రాందీషాపు

**తాగి లైసెన్స్ ఇచ్చారా?**

బోగోలు పంచాయితీలో చిన్నమసీదు వీధిలో ఏర్పాటుచేసిన బ్రాందీషాపు వలన ఆ ప్రాంత ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. మద్యం తాగి రోడ్లపై గొడవలు చేస్తుండడం, వచ్చేపోయేవారిని వేధిస్తుండడంతో స్థానికులు నిత్యం సమస్యలను ఎదుర్కొంటున్నారు. ముఖ్యంగా మహిళలు బ్రాందీషాపు వలన పడుతున్న అవస్థలు అన్నీ ఇన్నీ కావు. మసీదుకు ప్రార్ధనలకు వచ్చే ముస్లింలు తాగుబోతుల గొడవల కారణంగా ప్రశాంతతను కోల్పోతున్నారు. ఇదేమని ప్రశ్నిస్తే మద్యంషాపు నిర్వాహకులు తగువుకు వస్తున్నారని, పోలీసులకు తమ సమస్య విన్నవించుకొన్నా ఫలితం లేకుండా పోయిందని స్థానికులు వాపోతున్నారు. రంజాన్ మాసంలో ముస్లింలకు ఇబ్బందులు ఎదురౌతుంటే పోలీసు, ఎక్సైజ్ అధికారులు పట్టించుకోకుండా మద్యం షాపువారిచ్చే లంచాల మత్తులో మునిగితేలుతున్నట్లున్నారు.

● నాయుడుపేటలో

# రెచ్చిపోతున్న కబ్జాదారులు

**ప్రభుత్వ స్థలం కన్పిస్తే పాగా...**

జిల్లావ్యాప్తంగా ప్రభుత్వ స్థలాల దురాక్రమణ పెరిగిపోతోంది. ఖాళీగా స్థలం కన్పిస్తే చాలు రాత్రికి రాత్రి నిర్మాణాలు చేసేస్తూ తమ చెప్పుచేతల్లోకి స్థలాలను తెచ్చుకొంటున్నారు ఆక్రమణదారులు. అధికారుల ఉదాసీనత వీరికి వరంగా మారుతుండడంతో ఇలాంటివి అధికం అవుతున్నాయి. నాయుడుపేట పట్టణంలో కబ్జాదారుల చెరచిక్కిపోతున్న స్థలాలకు లెక్కేలేదు. పంచాయితీకి సంబంధించిన విలువైన స్థలాన్ని ఆక్రమించడమేకాక అమ్మిపారేసినా అడిగేదిక్కు లేకుండా పోయింది. గాంధీపార్కుకు సమీపంలో గల స్థలాన్ని ఒక వ్యక్తి ఆక్రమించి, మద్యం వ్యాపారులకు అమ్మేశాడంటే ఎంతగా బరితెగించి అక్రమణదారులు ప్రవర్తిస్తున్నారో తెలుస్తోంది. అలాగే పార్కు స్థలంలో మరో వ్యక్తి అక్రమంగా ఇల్లు కట్టేశాడు. కాలువలు ఆక్రమణకు గురౌతున్నాయి. ఇంతగా బహిరంగంగా కబ్జాలకు పాల్పడుతున్నా అడిగేనాధుడే లేకుండాపోవడంతో నాయుడుపేటలో స్థలాల దురాక్రమణ యదేచ్ఛగా సాగుతోంది.

● మంత్రి, ఎమ్మెల్యేలకు

# వింత అనుభవం!

అల్లూరు ఆస్పత్రికి మంత్రి ఆనం రామనారాయణ రెడ్డితో కలసి సందర్శనకు వచ్చిన కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావుకు చుక్కెదురైంది. మంత్రికి ఆస్పత్రి గురించి సిబ్బందితోపాటు బీద వివరిస్తూ ప్రజలకు వైద్యసేవలు అందించడంలో ముందుంటున్నదని, సిబ్బంది బాగా పనిచేస్తున్నారని చెప్పబోతుండగా ఆస్పత్రిలో వైద్యం కోసం వచ్చివుండిన రిటైర్డ్ టీచర్ జోక్యం చేసుకొని డాక్టర్లు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని, వైద్యం కోసం వస్తే డాక్టర్ లేడని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పి

**అల్లూరు ప్రభుత్వాస్పత్రా... మజాకా?**

పంపేస్తున్నారని, కానీ లోపల డాక్టర్ నిద్రపోతున్నాడని మంత్రికి ఫిర్యాదు చేశారు. ఆస్పత్రిని సొంత నిధులతో అభివృద్ధి చేస్తున్నానని చెప్పిన బీద రోగుల ఫిర్యాదులతో నిశ్చేష్టుడయ్యాడు. జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారికి ఫోన్‌లో ఆస్పత్రి సిబ్బంది నిర్వాకాన్ని తెలిపిన ఆయన తక్షణం వారిని బదిలీ చేయాలని కోరారు. అనంతరం సిబ్బందినుద్దేశించి మీరు ఈ జన్మలో మారరు అంటూ ఆగ్రహించారు. మొత్తం మీద ఆస్పత్రి సిబ్బంది నిర్వాకం కారణంగా బీద మస్తాన్‌రావు పలుచనవ్వాల్సి వచ్చింది.

# గుత్తావారిపాళెంలో దురాక్రమణలు

చిల్లకూరు మండలం గుత్తావారిపాళెంలో ప్రభుత్వ భూములను ఆక్రమించేస్తున్నారు. ఒకవైపు జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్‌లు ప్రభుత్వభూములు ఆక్రమించే వారిపై కఠిన చర్యలు తీసుకోవాలని రెవెన్యూ అధికారులకు ఆదేశాలు జారీ చేస్తున్నా అవి నిష్ప్రయోజనమౌతున్నాయి. గుత్తావారిపాళెంలో గమనిస్తే ఎంతగా ప్రభుత్వ భూములను ఆక్రమించేసి అమ్మకాలు సాగిస్తున్నారో తెలుస్తుంది. సర్వేనెంబర్ 743లో 150 ఎకరాల ప్రభుత్వ భూమి వుంది. దీనిలో 70 ఎకరాలను కొందరు చోటానేతలు రెవెన్యూ అధికారుల అండతో ఆక్రమించేసి అమ్మకానికి పెట్టేశారు. ఎకరా లక్షరూపాయల లెక్కన మద్రాస్‌కు చెందిన వ్యాపారులకు అమ్మేసేందుకు రంగం సిద్ధం చేశారట. ఈ ప్రాంతంలో భూముల ధరలకు రెక్కలు రావడంతో కన్పించిన స్థలాన్ని ఆక్రమించేసి సొమ్ము చేసుకొంటున్నారు. ఏకంగా పట్టాలు సృష్టిస్తున్నారంటే ఆక్రమణదారులకు రెవెన్యూ సిబ్బంది సహకారం ఎంతగా లభిస్తుందో తేటతెల్లమవుతోంది. కోట చీలురోడ్డు సమీపంలో వున్న ప్రభుత్వ భూములను ఆక్రమించేస్తున్నా సంబంధితశాఖ అధికారులకు చీమకుట్టినట్లు లేకపోవడంతో విమర్శలు వ్యక్తమవుతున్నాయి. ఇలాంటి అధికారులపై కొరడా ఝుళిపించందే దారికి వచ్చేటట్లు లేరు.

**ప్రభుత్వ స్థలాలు పటిక బెల్లం**

# వెంకటగిరి చెరువులు అధ్వాన్నం!

## మరమ్మత్తులెప్పుడు?

వెంకటగిరి నియోజకవర్గంలో చెరువుల పరిస్థితి అధ్వాన్నంగా వుంది. ఏళ్లతరబడి మరమ్మత్తులకు నోచుకోకపోవడంతో ఈ ప్రాంతంలో పంటల సాగు ప్రశ్నార్థకమవుతోంది. పంచాయితీరాజ్‌శాఖ ఆధ్వర్యంలో 321 చెరువులున్నాయి. వీటిలో వంద చెరువులకుపైగా అధ్వాన్న పరిస్థితిలో వుండగా, 56 చెరువులకు మరమ్మత్తులు చేపట్టేందుకు ప్రతిపాదనలు పంపి ఏళ్లు గడుస్తున్నా ఇంతవరకు చిన్నపని జరుగలేదు. వెంకటగిరి మండలంలో కలవలపూడి, వల్లివేడు, పెట్లూరు, పాళెంకోట, అమ్మపాళెం చెరువుల మట్టికట్టలు కరిగిపోతున్నాయి. డక్కిలి మండలంలో వెంబలూరు, చాపలపల్లి, ఆల్తూరుపాడు తదితర చెరువులకు గండ్లుపడి వున్నాయి. జిల్లాలోనే అతిపెద్ద చెరువుల్లో ఒకటైన బాలాయపల్లి మండలంలోని కయ్యూరు చెరువు మట్టికట్ట దెబ్బతిని ప్రమాదకర స్థితిలో వుంది. పిగిలాం, కొత్తపాళెం చెరువులకు రెండేళ్ల క్రితం గండ్లుపడినా వాటిని పూడ్చలేదు. ఇక రాపూరు మండలంలో 26 చెరువులకుగాను 14 చెరువులు దెబ్బతి న్నాయి. కలువాయి మండలంలో 20 చెరువులకుగాను 12 చెరువులు ప్రమాదక స్థితిలో వున్నాయి. చివరికి తూముల లీకేజీలు కూడా సరిచేయలేని స్థితి నెలకొనింది. రానున్నది వర్షాకాలం కావడంతో రైతుల్లో ఆందోళన నెలకొనింది.



రాష్ట్ర ఆర్థిక శాఖామాత్యులు శ్రీ ఆనం రామనారాయణరెడ్డి గారి చేతుల మీదుగా సన్మానం జ్ఞాపికను మరియు జిల్లా కలెక్టర్ శ్రీధర్ గారిచే పూలమాలతో సత్కారం అందుకున్న సన్మానగ్రహీతలు అంతర్జాతీయ వెటరన్ క్రీడాకారుడు డాక్టర్ మండవ శ్రీధర్‌రావు, వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియన్ కుమారి తులసి, నాట్యకళాకారిణి నదియాలతో ఆత్మీయులైన మురళీకృష్ణ హోటల్ ఎం.డి. వి.హజరత్‌బాబు.

# బోగోలు సర్పంచ్ బాగా పనిచేశాడు!

## వీడ్కోలు సభలో ప్రజల మెచ్చుకోలు

బోగోలు పంచాయితీ అభివృద్ధికి సర్పంచ్ పర్రి అంకులయ్య విశేషకృషి చేశారని పలువురు ప్రశంసించారు. సర్పంచ్‌ల పదవీకాలం పూర్తవుతున్న సందర్భంగా స్థానికులు సర్పంచ్, వార్డు సభ్యులను సన్మానించారు. ఈ సందర్భంగా గ్రామ ప్రజలు అంకులయ్య పంచాయితీ అభివృద్ధికి గతంలో ఏ సర్పంచ్ చేయని విధంగా పని చేశారన్నారు. నీటి సమస్య అధికంగా వుండేదని, డ్రైనేజీ సమస్య అస్తవ్యస్తంగా వుండి, వీధిలైట్లు వెలగని పరిస్థితుల్లో సర్పంచ్‌గా బాధ్యతలు చేపట్టిన ఆయన మౌలిక వసతుల కల్పనకు కృషి చేశారని సమస్యల పరిష్కారానికి అధికారులను కలిసి చర్చించేవారన్నారు. బేతేనీపేటలో మంచినీటి సమస్య పరిష్కారానికి ట్యాంకర్ ద్వారా నీటి సరఫరా జరిగేలా చర్యలు చేపట్టిన అంకులయ్య అభినందనీయుడన్నారు.

# అటకెక్కిన నీటి నిర్ధారణ కిట్లు!

## కలుషిత జలాలు తాగక తప్పడం లేదు

గ్రామీణ ప్రాంతాల్లో మంచినీటి నాణ్యతను పరీక్షించేందుకు ప్రభుత్వం అందజేసిన కిట్లు నిరుపయోగంగా మారాయి. కలుషిత జలాలను త్రాగడం వల్ల ప్రజలు పలు రోగాల బారిన పడుతుండడంతో దీనిని నివారించేందుకు జాతీయ గ్రామీణ నీటి నాణ్యత పరిశీలన పథకం క్రింద రెండేళ్ల క్రిందట జిల్లాలోని 963 పంచాయితీలకు మల్టీపారామీటర్ కిట్లను రెండు విడతలుగా పంపిణీ చేసింది. వీటిని ఉపయోగించి బ్యాక్టీరియాను పరీక్షించి సురక్షిత నీటిని ప్రజలకు సరఫరా అయ్యేలా చూడాల్సి వుంది. దీనికిగాను పారామీటర్ కిట్లను పరీక్ష చేసే విధానంపై ఆయా గ్రామాల సర్పంచ్‌లు, కార్యదర్శులు, సైన్సు టీచర్లు, అంగన్‌వాడీలు, హెల్త్ అసిస్టెంట్లకు శిక్షణ కూడా ఇచ్చారు. మొదట్లో కొద్దిరోజులు వీటిని వినియోగించినప్పటికీ తర్వాతికాలంలో ఇవి అటకెక్కాయి. పారామీటరు కిట్ల ద్వారా రక్షిత నీటిని అందజేసేందుకు పంచాయితీరాజ్, గ్రామీణ నీటి సరఫరా, వైద్య ఆరోగ్యశాఖలు సమన్వయంతో పని చేయాల్సి వుండగా ఆశాఖ అధికారులు తమకేమీ పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకం నీరుగారిపోయింది. కలుషిత నీటి ప్రభావంతో రోగాలబారిన పడే ప్రజల సంఖ్య అధికంగా వుంటున్నా అధికారులు స్పందించడం లేదు. ముఖ్యంగా ఆత్మకూరు నియోజకవర్గంలోని అనంతసాగరం, ఆత్మకూరు, ఎఎస్‌పేట, చేజర్ల, సంగం, మర్రిపాడు మండలాల్లో ఈ సమస్య అధికంగా వుంటోంది. ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులు మాత్రం నీటి పరీక్షలకు ఉపయోగించాల్సిన కెమికల్స్ లేకపోవడంతో కిట్లు మూలపడేశామని చెప్తుండడం వారి నిర్లక్ష్యాన్ని తెలియ జేస్తోంది.

# అరటితోటలు కనుమరుగు

## సాగు చేయడం కష్టం

జిల్లాలో అరటితోటలకు పేరుగాంచింది ఇందుకూరుపేట మండలం. పచ్చగా, ఏపుగా పెరిగిన అరటి చెట్లతో ఆహ్లాదకరంగా కన్పించే ఈ ప్రాంతంలో నేడు అరటిచెట్లు కనుమరుగౌతున్నాయి. ప్రకృతి వైపరీత్యాలు, ఇతరత్రా పరిస్థితుల కారణంగా అరటి సాగు చేస్తున్న రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. ఇటీవల కొన్నాళ్లుగా తుఫానుల ప్రభావం దీనిపై అధికంగా పడింది. దీనికితోడు సాగుకు అధికంగా ఖర్చు అవుతుండడం, సంరక్షణ బాధ్యతలు పెరగడం, క్రిమిసంహారక మందుల ధరలు పెరగడంతో రైతులపై అదనపు భారం పడుతోంది. ఈ పరిస్థితుల్లో అరటి రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. ప్రభుత్వం పరిహారం ప్రకటించినా అది సక్రమంగా అందకపోవడం, అక్రమాలు చోటు చేసుకోవడంతో అరటి సాగుకు రైతులు స్వస్తి చెప్తుండడంతో ఈ ప్రాంతంలో అరటితోటలు కనుమరుగౌతున్నాయి. ఒకనాడు మండల పరిధిలోని జగదేవిపేట, దేవిస్‌పేట, ఆదెమ్మ సత్రం, కొత్తూరు, ఇందుకూరుపేట తదితర గ్రామాలలో దాదాపు 10వేల హెక్టార్లలో సాగయిన అరటితోటలు నేడు మూడు, నాలుగు హెక్టార్లకే పరిమితం అవుతున్నాయి. రానున్న కాలంలో ఇది మరింతగా తగ్గనుందనే అభిప్రాయాన్ని పలువురు వ్యక్తం చేస్తున్నారు.

# కావలిని అభివృద్ధి చేయండి!

## రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి అభ్యర్థన

కావలి నియోజకవర్గ అభివృద్ధికి మంత్రులు, స్థానిక ఎమ్మెల్యే ఎలాంటి చర్యలు చేపట్టడం లేదని, కేవలం చుట్టపు చూపుగా వచ్చిపోతున్నారని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ నేత రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డి విమర్శించారు. పట్టణంలో ఇటీవల ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి, మునిసిపల్ మంత్రి మహీధర్‌రెడ్డి కావలిని గెస్ట్‌హౌస్‌గా భావిస్తున్నారు తప్ప నిజంగా ఈ ప్రాంత అభివృద్ధికి వారు చేపడుతున్న కార్యక్రమాలేవి లేవన్నారు. కావలితో తమకు అనుబంధం వుందంటూ ఇరువురు మంత్రులు మాట్లాడడం తప్ప కావలి ప్రజలకు చేసింది శూన్యం అన్నారు. ఇక స్థానిక ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావుకు ప్రజల బాగోగులు పట్టవన్నారు. చిన్నపాటి సమస్యనూ పరిష్కరించలేకపోతుండడంతో ఆయనను నమ్మి ఎన్నికల్లో ఓట్లు వేసిన జనం దిక్కుతోచని స్థితిలో వున్నారన్నారు. ఇప్పటికైనా మంత్రులు, ఎమ్మెల్యే బాధ్యతాయుతంగా పని చేసి కావలి నియోజకవర్గాన్ని అభివృద్ధి పరచాలన్నారు.

# కౌలు రైతుల పట్ల వివక్ష!

## రుణాలు ఇవ్వడంలేదని రైతుల ఆందోళన

కౌలు రైతుల పట్ల బ్యాంకులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయని రైతు నాయకులు ధ్వజమెత్తారు. తోటపల్లి గూడూరులో జరిగిన కౌలురైతుల సదస్సులో పలువురు బ్యాంకుల తీరుపై విరుచకపడ్డారు. ముఖ్యమంత్రి అట్టహాసంగా గుర్తింపు కార్డులు పంపిణీ చేసి బ్యాంకు అధికారులకు సూచించినా సంబంధిత మేనేజర్లు మాత్రం ససేమిరా అంటున్నారని రైతుసంఘం జిల్లా అధ్యక్షుడు గంగపట్నం రమణయ్య విమర్శించాడు. జిల్లా వ్యాప్తంగా 33,300 మందిని కౌలు రైతులుగా గుర్తించడం జరిగిందన్నారు. తొలివిడతగా రుణాల క్రింద 10కోట్లు కేటాయించినా ఒక్క కౌలు రైతుకూ ఈ రుణం అందలేదన్నారు. దీనికి లీడ్ బ్యాంక్ మేనేజర్ ఆనంద్‌కుమార్ సమాధానమిస్తూ 19 జాతీయ బ్యాంకులు 275 బ్రాంచీల ద్వారా సేవలందిస్తున్నాయని, కౌలుదార్లు గ్రూపులుగా ఏర్పడి రుణాలు పొందవచ్చన్నారు. స్టేట్‌బ్యాంకు స్పెషల్ ఆఫీసర్ శంకరయ్య మాట్లాడుతూ రుణాలు తీసుకొన్న తర్వాత తిరిగి చెల్లించడం మరచిపోతున్నందునే సమస్యలు తలెత్తుతున్నాయన్నారు. బ్యాంకులకు బకాయిపడి రుణాలు ఇవ్వడంలేదని నిందించడం తగదన్నారు. ఈ సమావేశంలో రైతుసంఘం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్, కౌలు రైతుల సంఘం అధ్యక్షుడు ముత్యాల గురునాథం తదితరులు పాల్గొన్నారు.

# సేవా సంస్థలకు సహకరించాలి!

## నారాయణ మెడికల్ కాలేజి డైరెక్టర్ సుబ్రహ్మణ్యం పిలుపు

సేవాసంస్థలు కొనసాగాలంటే సంకల్పబలంతోపాటు ప్రజల సహకారం అవసరమని నారాయణ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ డైరెక్టర్ జివి.సుబ్రహ్మణ్యం పేర్కొన్నారు. చిన్నచెరుకూరు గ్రామంలో దివంగత వేమారెడ్డి రామరాఘవరెడ్డి, యశోదమ్మల ట్రస్టు ఆధ్వర్యంలో నిర్వహించిన వైద్య శిబిరంలో ఆయన పాల్గొన్నారు. రామరాఘవరెడ్డి 26వ వర్ధంతిని పురస్కరించుకొని ఆయన కుమారుడు డాక్టర్ వేమారెడ్డి ప్రభాకర్‌రెడ్డి ఈ వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ రామరాఘవరెడ్డి ఆశయాలను కొనసాగించాలని, ఆయన బాటలోనే ప్రజలకు సేవ చేయాలన్నారు. నారాయణ మెడికల్ కళాశాల సిబ్బంది, లయన్స్ క్లబ్ ఆధ్వర్యంలో రక్తదాన శిబిరం, ఉచిత వైద్య శిబిరం జరిగింది. ఈ కార్యక్రమంలో మాజీ ఎంపిపి బొమ్మి సురేంద్ర, సింగిల్ విండో సొసైటీ అధ్యక్షుడు వరిగొండ చినబాబిరెడ్డి, తూపిలి సుబ్బారెడ్డి, మద్దిన హరగోపాల్ తదితరులు పాల్గొన్నారు.



## ఆచార్య దంపతులకు గడ్డుకాలం

సీనియర్ ఐఎఎస్ అధికారి బిపి ఆచార్య, ఆయన సతీమణి ఐఎఎస్ అధికారిణి రంజీవ్ ఆచార్యలకు గడ్డుకాలం వచ్చింది. బిపి ఆచార్య ప్రస్తుతం సిబిఐ విచారణలో వుండగా రంజీవ్ ఆచార్యకు కోర్టుధిక్కారణ నేరం క్రింద హైకోర్టు నెలరోజులు జైలు శిక్ష, జరిమానా విధించింది.ఎమ్మార్, జగన్ ఆస్తులపై సిబిఐ జరుపుతున్న విచారణలో బిపి ఆచార్య ఒకటో ముద్దాయిగా వున్నారు. ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక మౌలిక సదుపాయాల సంస్థ ఎండిగా బిపి ఆచార్య ప్రభుత్వ భూముల్ని ఇష్టం వచ్చినట్లు ప్రయివేటుపరం చేశారన్నది ఆయనపై అభియోగం. దీనిపై సిబిఐ జరుపుతున్న దర్యాప్తులో బిపి ఆచార్య పీకల్లోతు కూరుకు పోయారన్నది అభిజ్ఞ వర్గాల కథనం. ఈ కేసు కొలిక్కి రాగానే ఆచార్య అరెస్టు ఖాయమంటున్నారు. నిజానికి బిపి.ఆచార్య నిజాయితీ, దీక్షా దక్షతలు గల అధికారే. అయితే వై.ఎస్ హయాంలో రాజకీయ ఒత్తిడులకు లొంగిపోయారు. ఇది ఇలా వుండగా గనుల లీజుకు సంబంధించి గతంలో హైకోర్టు ఇచ్చిన ఉత్తర్వుల్ని ఆ శాఖ కార్యదర్శిగా వున్న రంజీవ్ ఆచార్య అమలు చేయలేదు. దీంతో హైకోర్టు ఆమెకు ధిక్కారణ క్రింద జైలు శిక్ష, జరిమానా, ఓ నెలరోజులపాటు సర్వీసు నుంచి తొలగిస్తూ ఆదేశాలిచ్చింది. పాపం ఆచార్య దంపతులకు రోజులు బాగున్నట్లు లేవు.

## ఎరక్కపోయి ఇరుక్కున్న 'బాబు'

ఈ మధ్య అవినీతి వ్యతిరేక మంత్రం జపిస్తున్న చంద్రబాబు ఎరక్కపోయి ఇరుక్కొని విద్యార్థుల మధ్య భంగపడ్డాడు. విశాఖపట్నంలో ఓ కార్యక్రమానికి హాజరయ్యేందుకు వెళ్లాడు బాబు. అయితే అప్పుడే అక్కడ ఎబిఎన్ ఆంధ్రజ్యోతి టివి ఆధ్వర్యంలో 'యంగిస్థాన్' కార్యక్రమం జరుగుతోంది. దీన్ని అవకాశంగా తీసుకొని తన అవినీతి వ్యతిరేక ఉద్యమానికి ప్రచారం కల్పించాలనుకున్నాడు బాబు. ఎలాగూ ఎబిఎన్ టివి ఎడిటర్ రాధాకృష్ణ అస్మదీయుడే కాబట్టి 'బాబు'కు సునాయాసంగానే అవకాశం చిక్కింది. ఈ కార్యక్రమంలో బాబు – రాధాకృష్ణల సంవాదం అంటూ డ్రామాలా నడిచింది. చంద్రబాబుపై వున్న అవినీతి ఆరోపణల్ని ఒక్కొక్కటిగా రాధాకృష్ణ అడగడం దానికి చంద్రబాబు ఖండిస్తూ వివరణ ఇవ్వడం అంతా ముందుగా చేసుకున్న ప్లాన్ అన్నట్లే జరిగింది. అంతా బాగుందనుకుంటున్న సమయంలో విద్యార్థులను ప్రశ్నించే అవకాశం ఇచ్చాడు కార్యక్రమ నిర్వాహకుడు రాధాకృష్ణ. దీంతో విద్యార్థులు రెచ్చిపోయి 'బాబు' అవినీతిని ఎండగట్టారు. రెండున్నర ఎకరాల ఆసామి ఈరోజు ఓ భారీ సంపన్నుడిగా ఎలా ఎదిగాడో చెప్పాలంటూ ఓ విద్యార్థి నిలదీశాడు. అలాగే 'బాబు'ను ఇరకాటంలో పెట్టే మరికొన్ని ప్రశ్నలు వచ్చాయి..

## 'చిరు' సంతోషం

సాక్షాత్తూ కాంగ్రెస్ అధినేత్రి సోనియా సమక్షంలో ప్రజారాజ్యం పార్టీని కాంగ్రెస్‌లో విలీనం చేయాలనుకున్న చిరంజీవి ఆశ నెరవేరలేదు. సోనియా వైద్యచికిత్స నిమిత్తం విదేశాలలో వుండటంతో ఢిల్లీ పెద్దల సమక్షంలోనే చిరంజీవి 'మమ' అనిపించాడు. అయితే ఈ కార్యక్రమానికి రాహుల్ గాంధీ హాజరుకావడం చిరు గుడ్డిలో మెల్లలా ఆనందిస్తున్నాడు. నిజానికి రాహుల్‌గాంధీ ఈ కార్యక్రమానికి రానన్నాడట. అయితే టి.సుబ్బరామిరెడ్డి బతిమాలి బామాలి రాహుల్‌ను ఓ అయిదు నిముషాల కోసం పట్టుకొచ్చాడట. చిరంజీవికి సుబ్బరామిరెడ్డి మొదటి నుంచి స్నేహితుడు. స్నేహధర్మాన్ని, రాహుల్ రూపంలో తీర్చుకున్నాడు. మొత్తానికి రాహుల్ రాకతో 'చిరు' మాత్రం తెగ సంబరపడి పోయాడట.




## ఆ రాజీనామాలు డ్రామాయేనా?

జగన్ వర్గ ఎమ్మెల్యేల రాజీనామాల్లో నిజాయితీ లేదా? అవన్నీ డ్రామాయేనా! అంటే అవునంటున్నారు రాజకీయ పరిశీలకులు. నిజంగా రాజీనామాలు చేసే ఉద్దేశ్యమే వుంటే ఈపాటికి గవర్నర్ వద్దకు వెళ్లి ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరిస్తున్నట్లు లేఖలు ఇచ్చి వుండాల్సిందట. స్పీకర్ కార్యదర్శికి అందజేసిన రాజీనామా లేఖలు కూడా ఒకే మూసలో సరైన ఫార్మాట్‌లో లేవట. పైగా ఈ రాజీనామా లేఖలకు కారణం ఎఫ్ఐఆర్‌లో ముద్దాయిగా పేర్కొన్నందుకు నిరసనగా అంటూ రాశారట. గతంలో కూడా ప్రత్యేక తెలంగాణ కోరుతూ టిఆర్ఎస్ ఎమ్మెల్యేలు ఇచ్చిన రాజీనామాల్ని భావోద్వేగంతో కూడుకున్నవంటూ స్పీకర్ తిరస్కరించారు. అసెంబ్లీ నింబంధనల మేరకు భావోద్వేగంతో గంపగుత్తగా చేసే రాజీనామాల్ని ఆమోదించరాదని వుంది. దీంతో జగన్ వర్గ ఎమ్మెల్యేలు రాజీనామాలు కూడా ఈ నిబంధనల ప్రకారం ఆమోదించే అవకాశం లేదంటున్నారు. ఇది ఇలా వుండగా జగన్‌వర్గ ఎంపీలు రాజమోహన్‌రెడ్డి, సబ్బం హరితోపాటు జగన్ కూడా తన ఎంపీ పదవికి రాజీనామాలు ఇవ్వలేదు. జగన్ తల్లి విజయమ్మతోపాటు జయసుధ తదితరులు రాజీనామాలు ఇవ్వలేదు. నిజంగా రాజీనామాలు చేసే వారైతే జగన్‌తోపాటు అందరూ ఒకేరోజు రాజీనామాలు ఇచ్చేవారని అంటున్నారు. జగన్ వర్గీయుల రాజీనామాల్లో సీరియస్‌నెస్ లేదని, కేవలం బెదిరింపుకోసమేనని రాజకీయ పండితులు తేల్చేస్తున్నారు. చూద్దాం! ఏం జరుగుతుందో!!






న్యూఢిల్లీ తెలుగు అకాడమీ నేతృత్వంలో హైదరాబాద్‌లో జరిగిన సాంస్కృతిక కార్యక్రమంలో నెల్లూరు హాస్య నటుడు హరిబాబును సన్మానిస్తున్న మాజీ ముఖ్యమంత్రి రోశయ్య.



తిరుచానూరు పద్మావతి అమ్మవారికి బంగారు వడ్డాణాన్ని బహుకరిస్తున్న నెల్లూరు రత్నం విద్యాసంస్థల అధినేత కెవి.రత్నం, ఆయన సతీమణి పద్మావతమ్మ.




బీట్ డీజిల్ కారును మార్కెట్‌లోకి విడుదల చేసిన సందర్భంగా నెల్లూరులోని ఇండివర్ మోటార్స్ నిర్వహించిన ర్యాలీకి జెండా వూపుతున్న ఐదవ పట్టణ ఎస్ఐ శ్రీనివాసులురెడ్డి. ప్రక్కన సంస్థ అధినేత దిలీప్ చక్రవర్తి.

# శుభకర మాసం రంజాన్!



ముస్లింలకు పవిత్రమైన మాసం రంజాన్ మాసం. శుభప్రదమైన కారుణ్యపు మాసం, సత్కార్యాల వసంత కాలంగా శ్లాఘించబడే మాసం. సర్వ మానవుల మార్గదర్శి దివ్యఖురాన్ అవతరించిన మాసం. ఉపవాసాల నిర్వహణకు ప్రత్యేకించబడిన శుభకర మాసం. అల్లాహ్ సామీప్యం పొందడానికి, దుష్కార్యాల విమోచనకు, మంచి శిక్షణ, సంస్కరణ కోసం సామూహిక వాతావరణాన్ని కల్పించే పవిత్ర మాసం ఇది. రంజాన్ నెలలో ప్రతి ఘడియ, ప్రతి గంట, ప్రతిక్షణం కూడా శుభప్రదమైనదే. వేయి నెలల రాత్రుల కంటే మేలైన రాత్రి ఈ మాసంలోని ఖురాన్ అవతరించిన 26వ ఉపవాస దీక్షకు ఉపక్రమించే రాత్రి. చేసే ప్రతి సత్కార్యం డెబ్బైరెట్ల పుణ్యఫలాన్ని ఈ మాసం అందిస్తుందని చెప్పబడింది.

రంజాన్ నెలలో చేసే ఉపవాసాన్ని రోజా అంటారు. ఆరోగ్యంగా వుండే ప్రతి ముస్లిం స్త్రీ, పురుషులపై రోజా విధిగా నిర్ణయింపబడింది. ఉషోదయానికి పూర్వం నుంచి సూర్యాస్తమయం వరకు దైవం కోసం అన్నపానీయాలను ముట్టుకోక, కోర్కెలను అదుపులో వుంచుకోవడాన్ని రోజా అంటారు. రంజాన్ నెల అంతా ఉండే ఉపవాసాలను ఫర్జ్‌మయ్యాన్ అంటారు.

దైవ ప్రవక్త ఉపవాస విశిష్టత గురించి చెప్తూ మనిషి సత్కార్యాలన్నీ వారి కోసం చేసుకొన్నా, ఉపవాసం మాత్రం తన కోసం ప్రత్యేకంగా పాటింపబడుతుంది. కనుక దాని ప్రతిఫలం కూడా స్వయంగా నేనే ఇస్తానని 'అల్లా'నే ప్రవచించారట. రంజాన్ నెలలో ప్రతి మనిషికీ వారు చేసే సత్కార్యాలకు గాను పది నుండి 700రెట్ల పుణ్యఫలం ప్రసాదించబడుతుంది. రోజాలను తిరస్కరించినవాడు కాఫిర్(దైవధిక్కారి) అవుతాడు. ఏ కారణం లేకుండా ఉపవాసాలను వాయిదా వేసినవాడు ఘోర అపరాధానికి గురి అవుతారని చెప్తారు.



రంజాన్ నెలలో ఉపవాసం ఉండినట్లయితే వారికి మోక్షం లభిస్తుందని, స్వర్గంలో ఉన్న రయ్యాన్ అనే ద్వారం గుండా వారికి స్వర్గప్రాప్తి చేకూరుతుందని చెప్పబడింది. ఉపవాసం వున్న వారు తప్ప ఇతరులు ఆ ద్వారం గుండా ప్రవేశించలేరు. అందుకే రంజాన్ నెలలో చేసే దానాలు సమాజంలోని ఆర్థిక అసమానతల్ని దూరం చేసేవిగా వుంటాయి. మామూలుగా చేసే ఐదు వేళల నమాజుతోపాటు రంజాన్ నెలలో ఇషా తర్వాత తరావీ నమాజు అదనం. ఎంతో పుణ్యఫలాల్ని ప్రసాదించే ఈ మాసంలో ఉపవాస దీక్షను పాటించడం వలన పుణ్యఫలాలు దక్కుతాయి.

J




## టార్గెట్ అంబటి!

తిరిగే కాలు తిట్టే నోరు ఊరకుండదు కదా? వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని నోటికొచ్చినట్లు తిడుతున్న ఆనం బ్రదర్స్‌ను అసలు మనుషులుగా జమకట్టాల్సిన అవసరంలేదని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ అధికార ప్రతినిధి అంబటి రాంబాబు అనడమే తరువాయి ఆయన్ను రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నోటికొచ్చినట్లు తిట్టి వదిలిపెట్టాడు. ఆయన అంబటి కాదు కంబళి రాంబాబు. ఎపిఐఐసి సంస్థ ఛైర్మన్‌గా వేలకోట్ల రూపాయలు దోచాడు. ఆయన ఎమ్మెల్యేగా గెల్చే సత్తాలేని నేత. అంబలి తాగేవాడికి మీసాలు ఎత్తేవాడొకడన్నట్లు మమ్మల్ని అంబటి వ్యాఖ్యానిస్తాడా? జగన్‌తోపాటు జైలులో చిప్పకూడు తినను అంబటి రాంబాబు సిద్ధంగా వుండమని శాపనార్థాలు పెట్టాడు. టివి 9 లైవ్‌షోలో వివేకా దెబ్బకు అంబటి లాంటి పెద్ద నోరు గల వ్యక్తే వెనక్కు తగ్గాల్సి వచ్చింది.

## తీరు మారని రవాణాశాఖ!



రవాణాశాఖ కార్యాలయంలో ఏజంట్ల వ్యవస్థ రద్దుచేశామని ఆ శాఖాధికారులు బీరాలు పలుకుతుంటారు. కానీ నెల్లూరు రవాణాశాఖ కార్యాలయం చుట్టుప్రక్కల కావాల్సినన్ని ఏజెంట్ల కార్యాలయాలున్నాయి. ఏజెంట్ల ద్వారా కాకుండా మామూలుగా ఈ కార్యాలయంలో అడుగుపెడితే సమాచారం చెప్పేవారుండరు. గంటలో కావాల్సిన పనికి సాయంత్రమవుతుంది. లైసెన్సులు, రిజిస్ట్రేషన్ గట్రా పనులకు జత చేయాల్సిన కాగితాల వివరాలు ఎవరూ చెప్పరు. కార్యాలయంలోకి వాహనం ప్రవేశించేందుకు గేటు తీసేవాడి నుంచి పనయ్యే వరకు అన్నింటికి సైలెంట్‌గా డబ్బులు వసూలు చేసే కార్యాలయాల్లో బహుశా రవాణా శాఖ కార్యాలయమే ముందు వరుసలో నిలుస్తుందేమో? ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఇటీవల నెల్లూరు పర్యటనకు వచ్చి అవినీతిరహిత పాలన అందిస్తానని గట్టిగా చెప్పారు. ఆ అవినీతి ప్రక్షాళనను రవాణా శాఖతో ప్రారంభిస్తే బాగుంటుందని నెల్లూరీయులు ఆకాంక్షిస్తున్నారు.

## వీధుల్లో మంత్రి కొడుకు

జగన్ వంటి కొడుకు ఏ తండ్రికీ పుట్టకూడదని కటువుగా వ్యాఖ్యానించి ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చిక్కుల్లో పడ్డాడు. ఈ విమర్శకు ప్రతి విమర్శగా వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులు మంత్రి కొడుకుకు పరీక్ష వ్రాయడం చేతగాక ఇతరులతో వ్రాయించి రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడ్డాడు. అటువంటి కొడుకునా కనాల్సింది? సినిమా హాల్‌లో మహిళలను అల్లరి చేసి ప్రజల చేత దెబ్బలుతిన్న కొడుకునా కనాల్సింది అంటూ వివేకానూ దెప్పిపొడిచారు. భానుశ్రీ పదవికోసం వివేకా పదుగురి ఎదుట అప్పటి సిఎం రాజశేఖర్‌రెడ్డి కాళ్లు పట్టుకోవడం తాను చూశానని ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి ప్రకటించడంపై ట్రంకురోడ్డులో విస్తృత చర్చ జరుగుతుంది.

## అన్నా... మయం!



అవినీతిని అంతంచేసే లోక్‌పాల్ బిల్లుపై ఆమరణ నిరాహార దీక్ష చేస్తున్న అన్నా హజారేకు పలు ఉద్యమాలకు ఊపిరిపోసిన 'సింహపురి' ముక్తకంఠంతో మద్దతు ప్రకటిస్తుంది. రాజకీయ పార్టీలన్నీ పోటీలుపడి అన్నాకు మద్దతు ప్రకటిస్తుండగా స్వచ్ఛంద సంస్థలు, ప్రజాసంఘాలు, యువజన సంఘాలు, విద్యార్థులు, వ్యాపారులు, మహిళలు ఎవరికివారు ముందుకొచ్చి ప్రదర్శనలు, ధర్నాలు నిర్వహిస్తున్నారు. ఈ ప్రదర్శనలతో సామాన్యులకు సైతం అన్నా హజారే ఎవరో తెలిసిపోయింది. ప్రదర్శన సందర్భంగా జాతీయ పతాకాలను చేతబడుతుండడంతో వాటికి ఎక్కడలేని డిమాండ్ పెరిగింది. మొత్తానికి నెల్లూరుకు 'అన్నా' ఫోబియా పట్టుకొంది. ట్రంకురోడ్డులో అయితే ఇది మరికాస్త ఎక్కువగా వుంది.

## ఎవరు నీతివంతులు



నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి నిప్పులాంటి నిజాన్ని చెప్పారు. రాజకీయాల్లో నీతిమంతులెవరైనా వుంటే గుండెల మీద చేయివేసుకొని చెప్పమన్నారాయన. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఆస్తులపై సిబిఐ దాడులు చేస్తున్న నేపథ్యంలో ఆయన గట్టి మద్దతుదారైన రాజమోహన్‌రెడ్డి ముందు ఎలక్ట్రానిక్ మీడియా మైకు పెట్టగా ఈ బంగారం లాంటి మాటన్నారు. జగన్‌పై ప్రభుత్వం ఎన్ని దాడులు చేయిస్తే అంత ప్రజాభిమానం పెరుగుతుందని సరికొత్త భాష్యం చెప్పారు. రాబోయే ఎన్నికల్లో ఇటు అసెంబ్లీ, అటు పార్లమెంటు సీట్లను అత్యధికంగా జగన్మోహన్‌రెడ్డి గెలవబోతున్నాడని జోస్యం చెప్పారు. రాజమోహన్‌రెడ్డి రాజకీయ నేతలపై చేసిన కామెంట్‌ను ఏ పార్టీ నేత ఖండించని వైనంపై ట్రంకురోడ్డులో విస్తృత చర్చ జరుగుతుంది.




నోటికి సంబంధించిన అనారోగ్య బాధలుంటాయి. దూరదేశప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. సోదరులకు మేలు చేస్తారు. మానసిక వేదనలు ఎదురవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. తోటివారు సాయమందిస్తారు. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వ్యాపారవృద్ధి చక్కగా సాగుతుంది. కొత్త భాగస్వామి లేదా మంచి అనుచరులు లభిస్తారు.




ఆరోగ్య విషయాలలో పెద్ద ఇబ్బందులు లేకపోయినా ఊపిరితిత్తులకు, కీళ్లకు సంబంధించి ఇబ్బందులుంటాయి. బంధువుల మూలంగా హాయిగా వుంటారు. ధనాదాయం బాగుంటుంది. ఖర్చులు అదుపులో వుంటాయి. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి వుంటుంది. వృత్తిపరుల మూర్ఖత వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి.




దీర్ఘరోగులకు ఇబ్బందులుండవచ్చు. కళత్రంతో గొడవలుండవచ్చు. కళత్ర బంధువులు దానికి కారణమవవచ్చు. ధన విషయాలలో లోటు లేదు. ఋణరూపంలో కూడా ధనప్రాప్తి. వ్యాపారులకు పోటీలధికం. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఉద్యోగులకు ప్రమోషన్ లేదా ఆదాయవృద్ధి వుండవచ్చు. రాజకీయులకు ఉత్తమకాలం. వృత్తిపరులు లాభపడతారు.




నిద్రలేమి, జ్వరంలాంటి బాధలుంటాయి. గాయాల అవకాశం కలదు. ధనవిషయంలో కూడ కటకట ఉండవచ్చు. ఖర్చులు కూడా అధికం. పొదుపు ధనం వృథా అవుతుంది. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు అమ్మకాలు తగ్గుముఖం పడతాయి. ఉద్యోగులకు అతికష్టంగా సాగుతుంది. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది.




పెద్దల సాయంతో ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి వుంటుంది. చిరకాలంగా ఎదురు చూస్తూ వచ్చిన శుభఫలితాలు అనుభూతిలోనికి వస్తాయి. శత్రువులు లొంగి నడచుకొంటారు. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ. గృహిణులకు బంధువుల రాక విశ్రాంతరాహిత్యాన్నిస్తుంది. విద్యార్థులకు చదువు సాగకపోవచ్చు.




హృదయ కోశబాధితులు జాగ్రత్తగా వుండాలి. కుటుంబసభ్యుల తోడ్పాటు చక్కగా వుంటుంది. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా వుంటాయి. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా వుండడానికి ప్రయత్నించండి. ఆర్థికలావాదేవీలు జాగ్రత్త. ఉద్యోగులకు పై అధికారుల సాయం చక్కగా లభిస్తుంది.

# వారఫలాలు

*తేది 27-8-2011 నుండి 2-9-2011 వరకు సింహంలో శుక్రుడు; కర్కాటకంలో బుధుడు; మేషంలో గురువు; మిథునంలో కుజుడు; వృషభంలో కేతువు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; కర్కాటక, సింహ, కన్య, తులల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

31 తేది రంజాన్.

1 తేదీ వినాయక చవితి.

### శుభ ముహూర్తాలు

2 తేదీ మకర లగ్నాన సా.04.00 నుండి 05.00 గంటల వరకు సాధారణ శుభముహూర్తాలున్నాయి.

### ఆగష్టు తిథులు

**శ్రావణ బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 27 | శని | త్రయోదశి | ప | 12.24 | గం.ల.వ |
| 28 | ఆది | చతుర్దశి | ఉ | 10.49 | గం.ల.వ |
| 29 | సోమ | అమావాస్య | ఉ | 09.07 | గం.ల.వ |
| | | **భాద్రపద శుద్ధ** | | | |
| 30 | మంగళ | పాడ్యమి | ఉ | 07.08 | గం.ల.వ |
| | | విదియ | తె | 04.54 | గం.ల.వ |
| 31 | బుధ | తదియ | తె | 02.27 | గం.ల.వ |
| 1 | గురు | చవితి | రా | 11.58 | గం.ల.వ |
| 2 | శుక్ర | పంచమి | రా | 09.27 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




వృత్తిరీత్యా ఉత్సాహం అధికమవుతుంది. ఆరోగ్యవిషయంలో ఒత్తిడి వల్ల ఇబ్బందులు. కళత్ర సుఖం చక్కగా వుంటుంది. ధనవిషయంలో లోటుండదు. సంతానమూలంగా సుఖశాంతులు లోపిస్తాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. రాజకీయులకు అత్యంతం అనుకూలమైన కాలం. వ్యాపార విస్తరణ చేస్తారు. విద్యార్థులకు మంచికాలం.




స్పెక్యులేషన్ మంచిది కాదు. ఆర్థికవిషయాల కటకట ఫీలవుతారు. నూతన వస్త్రాభరణాలు కొంటారు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులు అధికంగా కష్టపడాలి. రాజకీయులు పైవారి ఆదరణకు పాత్రులవుతారు.




జీవితభాగస్వామి బంధువులతో గొడవలు వుండవచ్చు. తల్లి అనారోగ్యం చింతనిస్తుంది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలు వుండవచ్చు. విద్యార్థులకు చదువు సాగదు. కళాకారులకు ఆశాభంగం. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది.




సంతానమూలంగా మానసిక వేదనకు గురి అవుతారు. దైవానుగ్రహానికి ప్రయత్నం చేయండి. గుట్టుగా కాలం గడపడం మంచిది. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. ఇరుగుపొరుగువారి సహాయం అందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. విద్యార్థులకు కొంత మేలు.




కుటుంబసభ్యుల నుండి సహాయ సహకారాలందవు. ఊహించని రీతిలో ధనవ్యయమవుతుంది. ఎంత పొదుపు చేయాలనుకున్నా వీలు కాదు. ఇష్టులైన వారికిగాను ఖర్చవవచ్చు. గృహనిర్మాణం లేదా వసతి గృహాన్ని అమ్మడమనే పనులలో నిమగ్నమవుతారు. వ్యాపారులకు, వృత్తిపరులకు మేలైన కాలం గాదు. గృహిణులకు సంతానమూలంగా మనశ్శాంతి ఉండదు. ఆర్థిక సమస్యలుంటాయి.




ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా వున్నా స్పెక్యులేషన్ జోలికి పోవద్దు. తప్పనిసరిగా కొన్ని గృహోపకరణాలు కొనవలసి వస్తుంది. ప్రమాదాలు, గాయాలు సూచితం. పెద్దలతో గొడవలు రావచ్చు. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. ఉద్యోగులకు ప్రోత్సాహకాలు తక్కువ. భూభవనాల వస్తువాహనాల ద్వారా ఆదాయ మార్గాలు సులభతరమవుతాయి.

# ‘ద్వారబంధం’లో మాతా, పుత్రి ఫలకాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*జె.భార్గవరావు శాస్త్రి — హైదరాబాద్*

** నేను ‘వాస్తు ఆచార్య’ విద్యార్థిని. ‘మాతా వామగతా’ పుత్రి దక్షిణగామి నీతి’ శ్లోకార్థాలను వివరించండి?*

‘వాస్తుసారము’ అధ్యాయాల్లో ‘గర్భవేష్ఠితభిత్త’ శ్లోకాలు చదువుతున్నప్పుడు పై శ్లోకాలు కంటబడతాయి. ద్వారానికి ఎడమ వైపున వున్న తలుపు చెక్క తల్లి అని, కుడి పార్శ్వమందలి చెక్క ‘పుత్రి’అని అటువంటి ఒకే రెక్క తలుపుకు ఒకటి, మూడు, అయిదు, ఏడు బేసి సంఖ్యలో చెక్కలను కూర్చాలని శ్లోకార్థం.

*పి.మధురిమారెడ్డి — కర్నూలు*

** ‘శ్రావణ మాసం’ ఈసారి మూఢంతో ప్రభావితమనీ ఏ పనీ చేయకూడదనీ అంటున్నారు. నిజమేనా?*

కత్తెర(కర్తరి), మూఢం(మౌఢ్యమి) రోజులు శుభకార్యాలు నిర్వర్తించకూడని రోజులని శాస్త్రాలు చెబుతున్నాయి. అయితే ఈ రోజుల్లో శంకుస్థాపనలు వంటి ప్రారంభ కార్యక్రమాలు చేయకూడదు. ముహూర్తాలను బట్టి ఇతరత్రా కార్యక్రమాలు నిర్వర్తించుకోవచ్చు.

*టి.లక్ష్మీశ్రీనివాసభార్గవ్ — నాయుడుపేట*

** గృహ దోషాలకు యంత్రం మేలు చేస్తుందా?*

మీ ఉద్యోగంలో అస్థిరత, భార్య అనారోగ్యం, పిల్లలులేనితనం వీటన్నింటికీ ‘సుదర్శన యంత్ర’ ప్రతిష్ట మేలు చేస్తుంది. ప్రయత్నించి చూడండి.

*ఎన్.శాంభవి — సూళ్లూరుపేట*

** మా అబ్బాయిది అశ్వనీ నక్షత్రం. ఓ అమ్మాయి జాతకం పంపారు. ఆవిడది జ్యేష్ఠ. ఈడుజోడు కుదురుతుందా?*

రెండు నక్షత్రాలూ పరస్పర వేధో నక్షత్రాలయినప్పటికీ, రాశి ఫలాలు బలీయంగా వున్నాయి. అందువల్ల వివాహం జరిపించవచ్చు.

*డి.పాల్‌జాన్ — ఏలూరు*

** నక్షత్ర ఫలితము, రాశి ఫలము ఏది చూడాలి.*

రెండూ చూడాలి. చూసి బేరీజు వేసుకోవాలి. నక్షత్రాధిపతి రాశి, తేది రాశి రెండూ చూడాలని ‘హరిదత్తుని’ గ్రహసంచార నిబంధన చెబుతోంది.

*ధీరజ్‌లాల్ చౌహాన్ — నెల్లూరు*

** మూఢంలో ముహూర్తాలు ఏ కారణం చేత నిర్ణయించరు?*

ఏ ముహూర్తానికైనా గురు, శుక్ర బలం చాలా ముఖ్యం. ఇవి శుభగ్రహాలు. సూర్యుడితో వుండటం వల్ల ‘మౌఢ్యమి’ చెడు ఫలితాలు సంభవిస్తాయి.

*ఎన్.శకుంతలానరేందర్ — తడ*

** నైరుతి, వాయువ్యం బ్లాకుల్లో ఏ బ్లాకు మంచిది?*

రెండు బ్లాకులూ మంచివి కాదు. నైరుతిలో పశ్చిమ, దక్షిణ దిశాకోణ దోషాలు, వాయువ్యంలో ఉత్తర వాయువ్యం, పశ్చిమ నైరుతి దిశాకోణ దోషాలు తప్పకుండా వుంటాయి.

*ఆర్.నటేష్‌కుంజు — హైదరాబాద్*

** నక్షత్రం ఖచ్చితంగా నిర్ణయిస్తున్నారా?*

అది మీరు ఇచ్చే సరైన కాలమాన ప్రమాణాలను బట్టి వుంటుంది. సరైన వివరాలు ఇవ్వకపోవడం వల్లే నూటికి అరవై శాతం జాతకాలు తప్పులతడికగా వుంటాయి.

*సి.అరవిందరెడ్డి — కోవూరు*

** వీధిపోట్లకు ‘విగ్రహప్రతిష్ట’ మంచిదేనా?*

మంచిదే. అది నలభైశాతం ఫలితాలనిస్తుంది. అయితే ఆ విగ్రహానికి తలుపులు, లోన నిత్యం వెలిగే దీపం, ఉదయాన్నే శుభ్రపరచి పూజ తప్పనిసరిగా చేయాలి. ‘నరఘోష’ యంత్ర ప్రతిష్ట మరో నలభై శాతం దుష్ఫలితాలను తగ్గిస్తుంది.

*సి.సృజనానాయుడు — కమ్మపల్లె*

** ఈశాన్యం బ్లాకు స్థలం. ఏ విధంగానూ కలసి రావడం లేదు. ఎందువల్ల?*

తూర్పు వీధి రైల్వే గోడకు తగిలి ఆగిపోయింది. ఉత్తరం వీధి వంపులు తిరిగింది. అందువల్ల మంచి ప్రభావాలేమీ వుండవు. పైగా ఆవలి గృహ కోణాలవేధ మీ స్థలాన్ని తాకుతున్నది. ఇలా వుంటే కలసి రాదు.

# దేవుళ్ల భూములు రక్షింపబడతాయా?

**జిల్లాలోని పలు దేవాలయాల భూములు దురాక్రమణదారుల చేతికి చిక్కడంతో వాటిలో ధూపదీప నైవేద్యాలు కరవయ్యాయి. ఈ పరిస్థితులలో కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి చొరవ తీసుకొని దేవాలయాలకు సంబంధించిన ఆస్తుల వివరాలు క్రోడీకరించి నివేదికను ఇవ్వమని దేవాదాయశాఖ ఎసికి ఆదేశాలిచ్చారు.**


వేణుగోపాలస్వామి దేవస్థానం ఆస్తులలో అపార్టుమెంట్ల నిర్మాణ దృశ్యం.

జిల్లావ్యాప్తంగా వివిధ దేవాలయాలకు సంబంధించిన భూముల పరిరక్షణకు ఆ శాఖ అధికారులు చర్యలు చేపట్టారు. ఏఏ దేవాలయాలకు ఏఏ ప్రాంతాల్లో భూములున్నాయి. అవి ఎవరి చేతుల్లో వున్నాయి? ప్రస్తుతం సాగుచేస్తున్న రైతుల వివరాల సేకరణలో అధికారులు నిమగ్నమై వున్నారు. దేవాలయాలకు కోట్ల రూపాయల విలువచేసే వేలాది ఎకరాల భూములున్నప్పటికీ ధూప, దీప, నైవేద్యాలకు నోచుకోలేని దేవాలయాలు అనేకం వున్నాయి. గత సంవత్సరం నుంచి దేవాలయాలకు సంబంధించిన భూముల వివరాలను సేకరించాలని ప్రభుత్వం పదే పదే ఆదేశిస్తోంది.

ఇదే విషయంపై జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశాల్లో అజెండాగా చేర్చి చర్చించాలని భావించారు. అయితే దేవాదాయ శాఖ అసిస్టెంట్ కమిషనర్ ఏదో ఒక కారణం చూపి సమావేశాలకు డుమ్మా కొడుతుండడంతో తిరిగి అజెండాను వాయిదావేస్తూ వచ్చారు. ప్రభుత్వం నుంచి ఆ శాఖ అధికారులకు గట్టిగా హెచ్చరికలు రావడంతో స్పందించక తప్పలేదు. దేవాలయాలకు ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్న వారు ఇష్టానుసారంగా ప్రవర్తిస్తూ భూములను కౌలుకు ఇచ్చేవారు. మరికొందరు ధర్మకర్తలు సొంతంగా సాగు చేసుకునేవారు.

కౌలు రైతులు చెల్లించే ధాన్యాన్ని విక్రయించగా వచ్చే నగదును నైవేద్యాలకు ఖర్చు చేయాల్సి వుంటుంది. దేవాదాయ శాఖ అధికారులు దాతలు దానం చేసిన భూముల గురించి పూర్తిగా పట్టించుకోకపోవడంతో కౌలు రూపంలో వచ్చే ధాన్యాన్ని విక్రయించి వచ్చే నగదును సొంత అవసరాలకు వినియోగించుకొని, దేవుడికి శఠగోపం పెట్టేవారు. ఈ క్రమంలో దేవాలయాలకు చెందిన భూములు అన్యాక్రాంతం అవుతున్నాయంటూ పలువురు ప్రజాప్రతినిధులు ప్రభుత్వానికి ఫిర్యాదులు కూడా చేయడం జరిగింది. జిల్లా కలెక్టర్‌గా వచ్చిన శ్రీధర్ రెడ్డి ఈ భూముల వ్యవహారంపై దృష్టిసారించి వీటి పరిరక్షణ కోసం నడుం బిగించారు.

దేవాలయాల భూముల్ని కౌలుకు ఇచ్చే సమయంలో ప్రభుత్వ నిబంధనలను పాటించాల్సి వుంటుంది. గ్రామ పంచాయితీ కార్యాలయ ఆవరణలో బహిరంగంగా వేలంపాటలు నిర్వహించాలి. ఈ వేలంపాటలో సన్న, చిన్నకారు రైతులు మాత్రమే పాల్గొని భూముల్ని కౌలుకు తీసుకోవాలి. దేవాలయాల భూములను భూస్వాములు, ధనికులు తమ చేతుల్లో వుంచుకొని వారు మరొకరికి కౌలుకు ఇస్తుంటారు. ఇలా చేయడం ప్రభుత్వ నిబంధనలకు పూర్తి విరుద్ధం. సన్న, చిన్నకారు రైతులుగా తహశీల్దార్‌చే ధృవీకరించబడి, జారీచేసిన పత్రాలను దేవాదాయశాఖ అధికారులకు సమర్పించాల్సి వుంటుంది. ఎటువంటి ధృవీకరణ, గుర్తింపు పత్రాలు సమర్పించకుండానే ధనికులు కౌలుకు తీసుకొంటున్నారు.

నగరంలోని వేణుగోపాలస్వామి దేవస్థానం, బైరాగిమఠం భూములపై ఆ శాఖ అధికారులు రహస్యంగా విచారణ చేస్తున్నట్లు సమాచారం. భూములను పరిరక్షించడంతోపాటు శిథిలావస్థకు చేరుకున్న సత్రాలను అభివృద్ధి చేయాలని సంకల్పించారు. దేవాదాయశాఖ అసిస్టెంటు కమిషనర్‌గా బాధ్యతలు స్వీకరించిన యానాదిశెట్టి దేవాలయాలకు సంబంధించిన భూములు, జమా ఖర్చుల వివరాలపై ఆరా తీస్తున్నారు. జిల్లా కలెక్టర్ ఆదేశాల మేరకు జిల్లాలో వున్న అన్ని దేవాలయాల్లో ప్రత్యేక ఆడిట్ కూడా నిర్వహించనున్నారు. మొత్తం మీద ఇప్పటివరకు దేముళ్ల భూముల్ని దర్జాగా అనుభవిస్తున్న వారికి శృంగభంగం కలగక తప్పదు.

హుషారు అధికారి

# కార్పొరేషన్ ప్రత్యేకాధికారికి కావాల్సినంత పని!

**నెల్లూరు కార్పొరేషన్ ప్రత్యేకాధికారిగా బాధ్యతలు స్వీకరించిన అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ఆకస్మిక తనిఖీలలో సిబ్బందిని హడలెత్తిస్తున్నారు. ఈయన దెబ్బకు సిబ్బందిలో కొంత చలనం కనపడుతోంది. ఆయన చివరి వరకు ఈ ధోరణిలోనే పని చేస్తే ఫలితముంటుంది.**


చిల్డ్రన్స్ పార్కు రోడ్డులో వేస్తున్న సిమెంటు రోడ్డు పనులను పరిశీలిస్తున్న కార్పొరేషన్ ప్రత్యేకాధికారి లక్ష్మీకాంతం.

మునిసిపల్ కార్పొరేషన్ ప్రత్యేకాధికారిగా బాధ్యతలు స్వీకరించిన అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ఆకస్మిక తనిఖీలతో అధికారులను హడలెత్తిస్తున్నారు. ఏదో ఒక సమయంలో ఏదో ఒక ప్రాంతంలో తనిఖీలు చేసి, పారిశుద్ధ్యాన్ని పరిశీలిస్తున్నారు. గతంలో కార్పొరేషన్ అధికారిగా వుండి పదవీ విరమణ చేసిన సీతారామయ్య ఏనాడు కూడా ఇటువంటి తనిఖీలు చేసిన దాఖలాల్లేవు. అధికారులు కూడా ప్రత్యేకాధికారి ఆదేశాలను ఖాతరు చేసేవారు కాదు.

ఆయన స్థానంలో నియమితులైన లక్ష్మీకాంతం కార్పొరేషన్ పరిపాలన, నగరాభివృద్ధిపై ప్రత్యేక దృష్టి సారించారు. అయితే కార్పొరేషన్ అధికారులు, సిబ్బంది పెద్ద ముదుర్లు. వారిని గాడిలో పెట్టడం చాలా కష్టంతో కూడిన పని. మునిసిపాల్టీ నుంచి కార్పొరేషన్ స్థాయికి మార్పు చెందినప్పటికీ అధికారులు, సిబ్బందిలో ఎటువంటి మార్పు కన్పించడం లేదు. పారిశుద్ధ్య పనుల నిర్వహణ కోసం సొసైటీల ద్వారా కార్మికులను నియమించుకొన్నారు. కార్పొరేషన్ రికార్డులలో నమోదు కాబడిన కార్మికులకు, రోజువారీ పనులకు హాజరవుతున్న వారికి చాలా వ్యత్యాసం వుంటుంది. శానిటరీ ఇన్స్‌పెక్టర్లు, మేస్త్రీలు పనిలోకిరాని వారికీ హాజరు వేస్తుంటారు.

ఇది చాలా సంవత్సరాల నుంచి జరుగుతున్న తతంగమే. వివిధ పన్నుల రూపంలో ప్రజలు చెల్లిస్తున్న సొమ్మును ఎవరికి తోచిన విధంగా వారు పలు రూపాల్లో దిగమింగుతున్నారు. ఇంజనీరింగ్ విభాగం, హెల్త్ విభాగం, సిటీ ప్లానింగ్, రెవిన్యూ జనన, మరణ ధృవీకరణ పత్రాల జారీ విభాగాల్లో పర్యవేక్షణ లేకపోవడంతో సిబ్బందిలో బాధ్యతారాహిత్యం కనిపిస్తుంది. ప్రధానంగా నగరంలోని రోడ్లు చాలా అధ్వాన్నంగా వున్నాయి. కొద్దిపాటి వర్షం వచ్చినా నీరు నిలబడిపోతుంది. సిమెంటు రోడ్ల నిర్మాణాలు జరుగుతున్నా అవి కూడా నాసిరకంగానే వున్నాయి. ఇంజనీరింగ్ విభాగంలో అధికారుల నిర్లక్ష్యమే ఇందుకు కారణంగా పేర్కొనవచ్చు.

ప్రస్తుత ప్రత్యేకాధికారి నగరాన్ని మరింత అభివృద్ధి పరచాలన్న సంకల్పంతో కార్పొరేషన్ అధికారులు, సిబ్బందితో తరచూ సమీక్షలు నిర్వహిస్తున్నారు. ఉద్యోగుల పనితీరు మారనిదే నగరాభివృద్ధి జరిగే అవకాశం లేదు. ఇక్కడ విధులు నిర్వహించే అటెండర్ దగ్గర నుంచి పై అధికారి వరకు ప్రతి ఒక్కరికి చిన్న విషయానికి కూడా అధికారపార్టీ నేతలు లేకుంటే రాజకీయ పక్షాల నేతల్ని ఆశ్రయించడం ఆనవాయితీగా మారింది. పనిచేసినా, పనిచేయకపోయినా ఏ ఒక్కరూ కూడా ప్రశ్నించే పరిస్థితి వుండదు. ప్రత్యేకాధికారి రాజకీయాలను ఏమాత్రం పట్టించుకోకుండా ప్రతి ఒక్కరు పనిచేయాలని ఆదేశిస్తున్నారు.

నగరంలో రిజర్వుడు స్థలాలు పరిరక్షించడం, శిథిలావస్థకు చేరుతున్న పార్కులను అభివృద్ధి పరచడంతోపాటు పన్ను ఎగవేతదారులకు నోటీసులు జారీ చేయడం, వసూళ్లను వేగవంతం చేయడం వంటి చర్యలు చేపట్టారు. అవసరమైతే జిల్లా కలెక్టర్ నుంచి సూచనలు, సలహాలు తీసుకొంటున్నారు. లైలా తుఫాన్ కారణంగా నగరంలో దెబ్బతిన్న రోడ్లకు నిధులు మంజూరయ్యాయి. ఈ నిధులతో చేపట్టే పనులను అధికార పార్టీకి చెందిన నేతలు తమ అనుచరులకు కట్టబెట్టారన్న ఆరోపణలు వున్నాయి. నిధుల ఖర్చు, పనుల్లో నాణ్యతా ప్రమాణాలు పాటించే విధంగా చర్యలు తీసుకుంటే మంచిది. ప్రత్యేకాధికారి తనిఖీలకే పరిమితం కాకుండా ఇతర సమస్యలపై కూడా దృష్టి సారించాల్సిన అవసరం వుంది.

## తట్టుకోలేను!

తాను నటించిన సినిమా పరాజయం పాలైతే తట్టుకోలేనంటుంది అందాల నటి ప్రియాంక చోప్రా. ఇటీవల ఆమె నటించిన అంజనా అంజానీ, సాత్ ఖూన్ మాఫ్, వాట్స్ యువర్ రాశి చిత్రాలు ఫ్లాప్ అయ్యాయి. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ నేను అపజయాన్ని అంత తొందరగా జీర్ణం చేసుకోలేను. ఆ తరహా వ్యక్తిత్వం సరైంది కాదని నాకు తెలుసు. కానీ అపజయం కలిగింది అనగానే ఎందుకో నా మనసు తట్టుకోలేదు. చిన్నతనంలో పరీక్షల్లో ఫెయిల్ అయితేనే వారం రోజులు ఎవరితోనూ సరిగ్గా మాట్లాడేదాన్ని కాదు. నాదృష్టిలో నటన అంత ఆషామాషీ వ్యవహారం కాదు. బోలెడంత కష్టపడాలి. కానీ నచ్చిన పని కాబట్టి కష్టంలో కూడా ఆనందం, ఆత్మసంతృప్తి వుంటాయంది.



## హన్సిక హ్యాపీ!

కందిరీగ చిత్రం బాగా ఆడుతుండడంతో హీరోయిన్ హన్సిక ఆనందానికి అవధులు లేవు. ఈ విషయమై మాట్లాడుతూ కందిరీగలో రామ్‌తో కెమిస్ట్రీ బాగా కుదిరింది. మస్కా కంటే బాగుంది. ప్రతి సినిమాలోనూ ఒకేలా కనిపించాలని నాకు ఉండదు. కానీ ఏం చేస్తాం? గ్లామర్ భామ అనే ముద్ర అందరికీ రాదు. ప్రేక్షకులు కథానాయిక అందంగా వుంటే చూద్దామని ఆశపడతారు. రెండో నాయిక అనిపించే సినిమాలో నటించనంటుంది ఈ అందాల భరిణె. ఓ మై ఫ్రెండ్ చిత్రంలో శృతిహాసన్ పాత్రకు ఎంత ప్రాముఖ్యత వుందో తన పాత్రకు అంతే ప్రాముఖ్యత వుండదంది.





## శ్రియ తిప్పలు

సల్మాన్‌ఖాన్‌తో సినిమాలు చేసిన హీరోయిన్లు ఆసిన్, సోనాక్షి సిన్హా ఎదిగారు. కత్రినాకైఫ్ సంగతి చెప్పనక్కర లేదు. ఆమె ఒకప్పటి గాడ్‌ఫాదర్ సల్మానే. సల్మాన్‌ఖాన్ అండ వుంటే బాలీవుడ్‌లో ఆ నాయికకు తిరుగులేనట్టేనని పేరు. ఈ ట్రాక్ రికార్డు చూసి కాబోలు హీరోయిన్ శ్రియ సల్మాన్ నామ జపం చేస్తోంది. తెలుగు, తమిళ చిత్రాల్లో ఆమెకు అవకాశాలు లేవు. సల్మాన్ దృష్టిలో పడితే కనీసం ఒకటి, రెండు అవకాశాలు రాకుండా పోతాయన్న ఆశతో ఇటీవల ముంబాయిలో జరిగిన సల్మాన్ సోదరి పుట్టిన రోజుకు హాజరయ్యింది. ఏమిటి సంగతంటే సల్మాన్ గొప్ప మానవతావాది. స్నేహానికి విలువిస్తాడు. అలాంటి వ్యక్తిని స్నేహితునిగా పొందడంకన్నా వేరే అదృష్టమేముందంటుంది.



## త్రిష కోరికలు

గత దశాబ్దానికి పైగా తెలుగు, తమిళ భాషల్లో హీరోయిన్‌గా నటించిన త్రిషకు ఈమధ్య చిత్రాలు తగ్గాయి. ఇంట్లో వాళ్లు పెళ్లి సంబంధాలు చూస్తున్నట్లు వార్తలొస్తున్నాయి. ఈ విషయం త్రిష వద్ద ప్రస్తావిస్తే అప్పుడే రిటైర్ అయిపోమంటారా? నాకు రెండు ముఖ్యమైన కోరికలున్నాయి. మళయాళంలో ఒక మంచి చిత్రంలో నటించాలి. హిందీలోనూ గుర్తింపు తెచ్చుకోవాలి. మంచి స్క్రిప్ట్ దొరికితే ఈ భాషల్లో వదలకుండా నటిస్తా. ఈ రెండు కోరికలు తీరను మరింత కాలం పడుతుంది. అప్పటివరకు హీరోయిన్‌గా కొనసాగుతానంటుంది.

## ఒంపు సొంపులే ముఖ్యం!



నేటి సినిమాల్లోని సంగీతంలో మాధుర్యం, హీరోయిన్ ఒంపుసొంపులే విజయంలో కీలకపాత్ర పోషిస్తున్నాయని పాత తరం హీరో అక్కినేని నాగేశ్వరరావు అభిప్రాయపడ్డారు. సుమంత్ హీరోగా నటిస్తున్న 'దగ్గరగా దూరంగా' సినిమా పాటల విడుదల కార్యక్రమానికి ముఖ్యఅతిధిగా విచ్చేసిన ఆయన మాట్లాడుతూ నేను హీరోగా ఎదగను సంగీతం ఎంతో సహకరించింది. నా సినిమాల విజయంలో సంగీతమే కీలకపాత్ర పోషించింది. ఇప్పటి సినిమాల్లో హీరోయిన్ల అందాల ప్రదర్శన ముఖ్యప్రక్రియగా మారింది. హీరో నటన కంటే మంచి పాటలు, హీరోయిన్ల ఒంపుసొంపులతో చిత్రాలు ఆడేస్తున్నాయి. మా రోజుల్లో సినిమా బాగా రావాలని నానాపాట్లు పడేవారు. ఇప్పుడాపాట్లు తగ్గాయని అక్కినేని చెప్పుకొచ్చారు.

## దృశ్యకావ్యం – ఉరుమి!



✍ అల్లూరు రహీం

చరిత్ర అంటే తారీఖుల, దస్తావేజులు కాదంటాడు మహాకవి శ్రీశ్రీ. అయితే కొన్ని నిజాలు, సమాజంలోని సంఘర్షణలు, వ్యక్తుల అలవాట్లు ఇవి కూడా చరిత్రే. గతాన్ని వెలికి తీసే సాధనం చరిత్ర. అయితే చరిత్రకు అందకుండా కాలగర్భంలో కలిసిపోయిన వాస్తవాలు కూడా వుంటాయి. వాస్కోడిగామా అంటే మనకు గుర్తొచ్చేది మన దేశానికి సముద్ర మార్గాన్ని కనిపెట్టిన విదేశీయుడనేదే. కానీ ఆయన మన దేశంలోని కేరళ రాష్ట్రంలో అపార సంపదను కొల్లగొట్టాలని ఎన్నో అక్రమాలకు పాల్పడిన కోణాన్ని బయటపెట్టే చారిత్రక చిత్రం ఉరుమి. ఈ చిత్రాన్ని ప్రముఖ ఛాయాగ్రహకుడు, దర్శకునిగా మారి ఎన్నో చిత్రాలను తీసిన సంతోష్ శివన్ రూపొందించాడు. చరిత్రను రీళ్లుగా చుట్టేసి వుంటే ఈ చిత్రాన్ని చూడలేం. సంతోష్ శివన్ దీన్నో ప్రేమమయ దృశ్యకావ్యంగా రూపొందించాడు. రెండుగంటల పది నిమిషాల పాటు సాగే ఈ చిత్రంలో ప్రతి ఫ్రేమ్‌ను దర్శకుడు అందంగా చిత్రీకరించను పడిన శ్రమ వెండితెరపై కనపడిపోతుంది. కేరళలోని పంట పొలాలు, ప్రకృతి రమణీయత, సెలయేళ్లు చూపిన తీరు ప్రేక్షకులను మంత్రముగ్దులను చేస్తుంది. ఓ జలపాతం దగ్గర ప్రేయసీప్రియులు కలసుకొని ఆ నీటి హోరు మధ్య మూగమనసులతో మాట్లాడుకొనే సన్నివేశంతోపాటు సముద్రంలో పాతకాలం నాటి ఓడల నడత, ఓ ఏనుగు ఘీంకారం, గుర్రాల దౌడు, హీరోయిన్ల అందచందాలను శృతిమించని తీరులో చూపిన తీరు బాగుంది. ముఖ్యంగా సీనియర్ నటీమణులు టబు, విద్యాబాలన్‌ల ముందు నిత్యమీనన్, జెనీలియాలు వెలవెలబోయారు. మంచి పాటలు, పాత్రలు మినహా నటులు కనపడని 'ఉరుమి' అనువాద చిత్రం అనిపించనట్లు మాటలు వ్రాసిన శశాంక్ వెన్నెలకంటి, సంగీతం కూర్చిన దీపక్‌దేవ్‌ను అభినందించకుండా వుండలేం.

చిత్రకథలోనికి వెళ్తే 15వ శతాబ్దంలో మన దేశంలోని కేరళ తీరంలో వుండే చిరక్కల్ ప్రాంతానికి వచ్చే వాస్కోడిగామాను అక్కడ పండే మిరియాలు అమితంగా ఆకర్షిస్తాయి. పోర్చుగీసు, స్పెయిన్, ఆస్ట్రేలియాలలో ఈ మిరియాలకు ఎంతో వాణిజ్య విలువ వుండడంతో ఆ రాజ్యాన్ని కబళించాలని ప్రయత్నాలు చేస్తుంటాడు. చిరక్కల్ రాజు బలహీనుడు. అతని మంత్రి వాస్కోడిగామా అభిమాని. యువ రాజు దేనికి కొరగాని వ్యక్తి. ఈ సమయంలో ఆటవిక ప్రాంతంలో వుండే ధీర యువకులు కేళు(పృధ్వీ), బవ్యాళి(ప్రభుదేవా)లు రాజుకు అండదండలందించి వాస్కోడిగామా కుమారుడిని బందీని చేస్తారు. దీనికి మెచ్చిన రాజు కేళును చిరక్కల్ రాజ్యానికి సైన్యాధిపతిని చేస్తాడు. బవ్యాళికి రాజు కమార్తె బాల(నిత్యమీనన్) దగ్గరవుతుంది. రాజ్యంలోని మరో ధీరవనిత అయేషా(జెనీలియా)ను కేళు ఇష్టపడతాడు. ఇవన్నీ మెచ్చని మంత్రి రాజకుమారునితో కలసి నీచ పథకం వేసి వాస్కోడిగామా కుమారుని చెరసాల నుంచి విముక్తుడిని చేస్తాడు.

చిత్ర సమీక్ష

వాస్కోడిగామాను తమ రాజ్యంపై దండెత్తమంటారు. రాజకుమారుడు సింహాసన కాంక్షతో తన తండ్రినే వాస్కోడిగామా యిచ్చిన పిస్తోలుతో కాల్చి చంపుతాడు. రాజు లేని రాజ్యం పరవు ప్రతిష్ట నిలిపే బాధ్యతలు కేళు స్వీకరించి తన దగ్గర వుండే అద్భుత ఆయుధం 'ఉరుమి'తో శత్రుశేషాన్ని మట్టుపెట్టడమేగాక తాను వీర మరణం పొందడంతో చిత్రం ముగుస్తుంది.

పృధ్వీ, ప్రభుదేవా, జెనీలియా, నిత్యమీనన్, ఆర్య, విద్యాబాలన్‌ల తోపాటు రాజు, మంత్రి, వాస్కోడిగామా, అతని కుమారుని పాత్రలు పోషించిన నటుల నుంచి అద్భుత నటనను రాబట్టడంలో దర్శకుడు సంతోష్‌శివన్ విజయం సాధించాడు. ద్వితీయార్థం నడతలో వేగం తగ్గినా 'ఉరుమి'ని బోర్ ఫీల్ కాకుండా చూసేయవచ్చు.



# వివాదంలో వక్ఫ్‌బోర్డు స్థలం

ఇటీవల కాలంలో నగరంలో పలు ఖాళీ స్థలాలు వివాదాస్పదంగా మారుతున్నాయి. రెవిన్యూ అధికారులు సకాలంలో స్పందిస్తే వివాదాలకు తెరదించవచ్చు. కానీ అధికారులు నెలలు తరబడి పట్టించుకోకపోవడం కారణంగా కోర్టులకు వెళ్తున్నారు. జిల్లా కోర్టు దగ్గర నుంచి రాష్ట్ర హైకోర్టులో అనేక కేసులు పెండింగ్‌లో వున్నాయి. నెల్లూరు నగరంలో తాజాగా మరో వక్ఫ్ బోర్డు స్థలం వివాదంగా మారింది. ముస్లిం పెద్దలు పలుమార్లు చర్చలు జరిపినా ఒక కొలిక్కి రాలేదు. నగరంలో ఒకటవ నగర పోలీస్ స్టేషన్‌కు సమీపంలో దాదాపు 50 అంకణాలకు పైగా వక్ఫ్‌బోర్డు స్థలం వుంది. ప్రస్తుతం ఈ స్థలం సింహపురి ట్రేడర్స్ యజమాని ఆధీనంలో వుంది. గతంలో ఈ స్థలాన్ని ఆక్రమించుకున్న వారు నకిలీ డాక్యుమెంటు సృష్టించుకొని అనంతరం ఈ స్థలాన్ని ఇతరులకు విక్రయించారు. నగరంలో వక్ఫ్ బోర్డుకు సంబంధించిన మొత్తం స్థలాలపై సమగ్ర సర్వే చేయాలని ప్రభుత్వానికి విన్నవించుకోవడంతో సెంట్రల్ సర్వే ఆఫ్ ఇండియా బృందం సర్వే చేసింది. ఈ సర్వేలో ఒకటవ నగర పోలీస్‌స్టేషన్ సమీపంలో వున్న స్థలం కూడా వక్ఫ్‌బోర్డుకు చెందినదిగా గుర్తించారు. అప్పటి నుంచి జెండావీధికి చెందిన ముస్లిం నేతలు, కొనుగోలు చేసిన వ్యాపారి మధ్య వివాదం చోటుచేసుకొంది. ఈ ప్రాంతంలో అంకణం ఏడు లక్షల నుంచి పది లక్షల రూపాయల వరకు ధర పలుకుతుంది. వక్ఫ్ బోర్డుకు స్వాధీనం చేయాలని ముస్లిం నేతలు పట్టుబడుతున్నారు. కోట్ల రూపాయలకు కొన్న ఈ స్థలాన్ని సదరు వ్యాపారి ఎలాగైనా దక్కించుకోవాలని రాజకీయ నేతల చుట్టూ తిరుగుతున్నాడు. ఈ స్థలం అంతిమంగా ఎవరి సొంతమవుతుందో?



వన్‌టౌన్ పోలీస్‌స్టేషన్ వెనుకనున్న వక్ఫ్‌బోర్డు స్థలం.



వెంచర్ బ్రోచర్‌ను విడుదల చేస్తున్న డాక్టర్ శ్రీధర్‌రావు. ప్రక్కన రిషిజైదీప్ గ్రూప్ సిఎండి రిషికుమార్‌రెడ్డి, డైరక్టర్లు సుధాకర్‌రావు, భక్తవత్సలం.

# రిషిజైదీప్ వారి బృందావన్ గార్డెన్స్!

నెల్లూరు పొదలకూరురోడ్డులో రిషిజైదీప్ నూతన వెంచర్ బృందావన్ గార్డెన్స్ ప్రారంభోత్సవ కార్యక్రమం 21వ తేది ఆత్మీయులు, అభిమానుల నడుమ ఘనంగా జరిగింది. ప్రముఖ డాక్టర్, వెటరన్ క్రీడాకారుడు మండల శ్రీధరరావు వెంచర్‌ను ప్రారంభించి మాట్లాడారు. పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందుతున్న పొదలకూరురోడ్డులో స్థిరాస్తిపై పెట్టుబడి తక్కువ కాలంలోనే ఎక్కువ లాభాలను తెచ్చి పెడుతుందన్నారు. రిషిజైదీప్ ఎమ్డీ రిషికుమార్

## రెండు లక్షలకే పొదలకూరురోడ్డులో ప్లాటు

రెడ్డి మాట్లాడుతూ పొదలకూరురోడ్డులో వెంచర్‌ను ప్రారంభించడం ఆనందంగా వుందని రాబోయే రోజుల్లో విమానాశ్రయం, రాడార్ కేంద్రం ఈ ప్రాంతంలోనే ఏర్పాటుచేస్తున్నట్లు చెప్పారు. డైరక్టర్ సుధాకర్ మాట్లాడుతూ పొదలకూరురోడ్డులో ఇప్పటికే కార్పొరేషన్, జడ్పీ, కలెక్టర్ ఆఫీసులు ఏర్పాటు చేయడం జరిగిందని, భవిష్యత్తులో ఈ ప్రాంతంలో ఇళ్ల స్థలాలకు డిమాండ్ వుంటుందన్నారు.తమ వెంచర్‌లో రెండు లక్షల రూపాయలకే ఇంటి ప్లాటు ఇస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో సంస్థ డైరక్టర్లు బి.భక్తవత్సలం, ఇ.సునీల్ కుమార్ తదితరులు పాల్గొన్నారు.

# తుఫాన్లపై అప్రమత్తంగా వుండండి!

## అధికారులతో కలెక్టర్ సమీక్ష

ఇక వచ్చేది తుఫాన్ల సీజన్. దీనిని దృష్టిలో వుంచుకొని అధికారులందరూ అప్రమత్తంగా వ్యవహరించాలని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి సూచించారు. ఆగష్టు 18వ తేది గోల్డెన్ జూబ్లీ హాలులో వివిధ శాఖల అధికారులతో ప్రకృతి వైపరీత్యాలు – తీసుకోవాల్సి జాగ్రత్తలపై సమీక్షించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ మాసాల్లో తుఫాన్లు అధికంగా వస్తుంటాయి. దీన్ని గుర్తుంచుకొని ముందస్తు జాగ్రత్తలు తీసుకోవాలని, ఎలాంటి విపత్తునైనా ఎదుర్కొనేందుకు సిద్ధంగా వుండాలని అధికారులను అప్రమత్తం చేశారు. జిల్లావ్యాప్తంగా 178 తుఫాను షెల్టర్లుండగా వీటిలో 107 షెల్టర్లు పటిష్టంగా వున్నాయని వీటి నిర్వహణ, ఏర్పాట్లను పరిశీలించాలని పంచాయితీరాజ్ అధికారులకు సూచించారు. ప్రతి షెల్టర్‌లో జెసిబి, జనరేటర్లను సిద్ధంగా వుంచుకోవాల



సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన ఎస్పీ రమణకుమార్, జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్.

న్నారు. తీరప్రాంత గ్రామాలైన ఇస్కపాళెం, శ్రీహరికోట, దుగరాజుపట్నం, వాకాడు, అల్లూరు తదితర ప్రాంతాలపై ప్రత్యేక దృష్టి సారించాలన్నారు. బోట్లు, గజఈతగాళ్లను సిద్ధంగా వుంచుకోవాలని మత్స్యశాఖ అధికారులకు సూచించారు. అంబులెన్స్, మందులు, వైద్యులను, ఆహార పొట్లాలను, పాల ప్యాకెట్లను రెడీగా వుంచుకోవాలని అందుకు తగిన ఏర్పాట్లు చేసుకోవాలని వైద్య ఆరోగ్య శాఖ, పౌరసరఫరాల శాఖను ఆదేశించారు. విద్యుత్ సరఫరాలో అంతరాయం ఏర్పడకుండా చూడాలని విద్యుత్ శాఖ అధికారులకు సూచన చేశారు. కాల్వల్లో పూడిక తీయాలని, చెత్త నిల్వలేకుండా చూడాలని జెసి సౌరభ్‌గౌర్ మునిసిపల్ అధికారులకు సూచించారు. ఎస్పీ రమణకుమార్ మాట్లాడుతూ గ్రామస్థాయి కమిటీలను ఏర్పాటు చేసుకోవాలని, అన్ని శాఖలు సమన్వయంతో పనిచేస్తే ఎలాంటి విపత్తునైనా ఎదుర్కోవచ్చన్నారు.

# సరస్వతి నిధికి కలెక్టర్ చేయూత



సరస్వతి నిధికి 50వేల రూపాయల చెక్కును డిఆర్వో రామిరెడ్డికి అందిస్తున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.

నెల్లూరు కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి మానస పుత్రిక సరస్వతి నిధికి పదుగురు విరాళాలు ఇవ్వాలని కోరడమే కాదు. స్వయంగా ఈ పథకానికి కలెక్టర్ తన స్వంత నిధుల నుంచి 50వేల రూపాయలను డిఆర్వో బి.రామిరెడ్డికి అందజేశారు. కలెక్టర్ మరికాస్త చొరవ చూపితే ఈ పథకానికి కావాల్సిన కోటి రూపాయల నిధి మూడు నెలల్లో సమకూరుతుంది. ఈ పథకానికి నిధుల కోసం జిల్లాలోని వదాన్యులతో ఒక సమావేశం ఏర్పాటుచేస్తే అనుకొన్న టార్గెట్ సాధించవచ్చు. ఆ వైపుగా ప్రయత్నం చేస్తే బాగుంటుందేమో!



ఇండియన్ లీడర్‌షిప్ అవార్డ్ ఫర్ హాస్పిటాలిటీ అండ్ టూరిజంను అందుకొన్న డిఆర్ ఉత్తమ హోటల్ అధినేత ధనుంజయరెడ్డిని సన్మానిస్తున్న అమరావతి కృష్ణారెడ్డి, మురళీకృష్ణ హజరత్‌బాబు, మయూరి సుబ్బారావు, వెంకటరమణ మాల్యాద్రి.



ర్యాలీలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులు అనిల్‌కుమార్ యాదవ్ తదితరులు.

# వైఎస్ఆర్ కాంగ్రెస్ నిరసన!

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డిపై సిబిఐ దర్యాప్తును నిరసిస్తూ ఆ పార్టీ కార్యకర్తలు నగరంలో భారీ ర్యాలీ నిర్వహించారు. ఆ పార్టీ కన్వీనర్, జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి నేతృత్వంలో జరిగిన ఈ కార్యక్రమంలో అధిక సంఖ్యలో పార్టీ కార్యకర్తలు, వైఎస్ఆర్ అభిమానులు పాల్గొని తమ నిరసన తెలియజేశారు. జనాదరణతో రోజురోజుకు ప్రజానేతగా ఎదుగుతున్న జగన్‌ను చూడలేక, ఆయన ఖ్యాతిని తట్టుకోలేక ఎలాగైనా దెబ్బతీయాలన్న కుట్రతో కాంగ్రెస్ పార్టీ సిబిఐ దాడులు చేయిస్తోందని గోవర్ధన్‌రెడ్డి ఆరోపించారు. ఇలాంటి కుట్రలు ఎన్ని చేసినా, తప్పుడు కేసులు పెట్టినా ప్రజల ఆదరణ, అభిమానం వున్నంతవరకు జగన్‌ను ఏమీ చేయలేరన్నారు. మరో నేత అనిల్‌కుమార్ యాదవ్ మాట్లాడుతూ తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలు కుట్రపన్ని జగన్‌పై బురద జల్లుతున్నారని, సిబిఐ దాడులు, దర్యాప్తులు చేయిస్తోందని ఆరోపించారు. జగన్‌ను అణగదొక్కే ప్రయత్నంలో భాగంగానే ఇలాంటి కుట్రలు పన్నుతున్నారని విమర్శించారు. అనంతరం కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీ, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి దిష్టిబొమ్మలను దగ్ధం చేశారు.

## జైలుకెళ్లినా జనం నాతోనే

మొదటి పేజీ కొరవ

వాటిలో అత్యంత ప్రమాదకరమైనది – మారిషస్‌లో బినామీ కంపెనీలు నెలకొల్పి, ఇక్కడి నల్లధనాన్ని తరలించి, తెల్లధనంగా తన కంపెనీలోకి రప్పించడం. గొంతుకు వుచ్చు బిగించే మరొక తప్పిదం – కలకత్తాలో వూరు పేరు లేని వ్యక్తుల పేరుతో పదుల సంఖ్యలో కంపెనీలు నెలకొల్పి, వాటిద్వారా పెట్టుబడుల వరద పారించడం. ఇవన్నీ రికార్డు మూలకంగా దొరికిపోయే నేరాలు. వాటికి సంబంధించిన మనీ లాండరింగ్, విదేశీమారక నియంత్రణ చట్టాలకు పదునెక్కువ. ఒకసారి ఆ బోనులో చిక్కితే బయటపడడం కష్టం. ఎంత కొమ్ములు తిరిగిన న్యాయ నిపుణులు కూడా రక్షణ కవచం అమర్చలేరు.

## వైట్‌హౌస్ వెలవెల!

రాజకీయవాదులు సాధారణంగా లంచాలను డబ్బు రూపంలో తీసుకొంటారు. ఇచ్చేవాడికి, తీసుకొనే వాడికి తప్ప మూడో కంటికి ఆ నిజం తెలియదు. సిబిఐలు, ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్‌లు ఏమీ చేయలేవు. కానీ జగన్ కొన్ని వేల కోట్ల రూపాయలను తన కంపెనీలలో వాటాలుగా మార్చిడి చేశాడు. చూస్తేనే కళ్లు చెదిరిపోయే రీతిలో భవనాలు నిర్మించాడు. బెంగుళూరులో జగన్ నిర్మించుకొన్న రాజసౌధం ముందు అమెరికన్ అధ్యక్షుడి వైట్ హౌస్ వెల వెల పోతుందని చెప్తారు. ఆ ఇంట్లో తలుపులకు గెడులు, బాత్‌రూములో కొళాయిలు బంగారు పూత పోసినవట. కిటికీలకు కట్టిన పరదాలు కూడా బంగారు జరీతో నేసినవట. అంత వికృతంగా అక్రమార్జనను ప్రదర్శించడం దేశ చరిత్రలో ఏ రాజకీయవాదీ చేయని సాహసం. పాత కాలంలో హాజీ మస్తాన్, యూసఫ్ పటేల్ వంటి స్మగ్లర్ల ఇళ్లలో అటువంటి అలంకారాలు వుండేవని చెప్పుకొనేవారు ఇంతకాలం. హైదరాబాదులో జగన్ కట్టుకొన్న ఇంట్లో 14 లిఫ్టులు వున్నాయి. నాలుగు ఎస్కలేటర్లు వున్నాయి. 20 బెడ్‌రూమ్‌ల భారీ భవంతి అది.

కంపెనీలలో ఇన్నేసి వేల కోట్ల రూపాయల వాటాలు, ఇళ్ల పేరిట ఇన్నేసి వందల కోట్ల విలువ చేసే భవంతులు నిర్మించుకొని, కాంగ్రెస్ తన మీద కక్ష కట్టి సిబిఐ దర్యాప్తు జరిపిస్తున్నదని ఆగం చేస్తే ఎట్లా?

ఈ తప్పులకు శిక్ష తప్పదు. జైలుకు పోవడం తప్ప వేరే గత్యంతరం లేదు. ఆ సంగతి జగన్‌కు బాగా తెలుసు. ఎన్నో రోజుల ముందుగానే అందుకు మానసికంగా సిద్ధమైనాడు కూడా. సుప్రీంకోర్టు ఆశ్రయంతో కొంతకాలం వాయిదా పడుతుందనే ఆశ వీగి పోవడంతో, శ్రీకృష్ణ జన్మస్థాన నివాసానికి సిద్ధమౌతున్నాడు. అయితే విచిత్రంగా అవినీతి నేరం మీద జైలుకు వెళ్లవలసి వస్తున్నదన్న చింత జగన్‌లో ఎంత మాత్రం లేదు. పశ్చాత్తాప భావన పీసమంత కూడా లేదు.

## జైలంటే భయం లేదు!

జైలుకు పోతే నష్టమేమిటి అని ప్రశ్నిస్తున్నాడాయన. ఇంతకాలం ప్రతిపక్షాలు, ప్రత్యర్థులు నా మీద సిబిఐ దర్యాప్తు చేయాలని గోల చేశారు. అది జరిగిపోయింది. నా ఇంటి మీద సిబిఐ దాడులు కూడా జరిగాయి. కానీ జనం మాత్రం నాతోనే వున్నారని రుజువైంది. కృష్ణా జిల్లాలో జరుగుతున్న ఓదార్పు యాత్ర అందుకు నిదర్శనం. రేపు జైలుకు వెళ్లవలసి వచ్చినా ఈ జనం నాతోనే వుంటారు. ఎన్నికలలో నాకే ఓటు చేస్తారు. ఈ జైళ్లు, చట్టాలు నన్ను ముఖ్యమంత్రి కాకుండా అడ్డుకోలేవు. అందువల్ల జైలంటే నాకు భయం లేదు. నన్ను జైలుకు పంపిన పాపానికి కాంగ్రెస్ పార్టీ మట్టి కొట్టుకొని పోతుంది తప్ప నాకొచ్చే నష్టం ఏమీ లేదు అని నిక్కచ్చిగా చెప్తున్నాడు జగన్. తన అంతరంగికులు, కుటుంబ సభ్యులకు ధైర్యం చెప్తున్నాడు. నా లక్ష్యం రాజకీయ అధికారం, దానికి ఈ సిబిఐ కేసులు అడ్డంకి కానప్పుడు, వాటిని చూసి నేనెందుకు భయపడాలి అనే ధీమాతో మాట్లాడుతున్నాడాయన.

ఆయన మాటల ధోరణి చూస్తే, జైలుకు వెళ్లడమంటే ఏదో విహార యాత్రకు పయనమైనంత సులభంగా తీసుకొన్నట్లు కన్పడుతున్నది. రాజకీయవాదులు అవినీతి కేసుల మీద జైలుకు వెళ్లడం కొత్తేమీ కాదు కాబట్టి తానెందుకు చింత పడాలన్న తెగింపు కన్పడుతున్నది. అయితే విచారణ సందర్భంలో జైలుకు వెళ్లడం వేరు. నేరం రుజువైన తర్వాత శిక్ష పడితే, కారాగారవాసం అనుభవించడం వేరు. మనీ లాండరింగ్, అవినీతి నిరోధం, విదేశీమారక ద్రవ్యం వంటి చట్టాలలో ఏ ఒక్కదాని మీద నేరం రుజువైనా శిక్ష తప్పదు. అది రెండేళ్ల నుంచి పదేళ్ల వరకు వుంటుంది. న్యాయస్థానాలు ఒకసారి క్రిమినల్ చట్టాల క్రింద రెండేళ్ల చెర శిక్ష విధిస్తే, ప్రజా ప్రాతినిధ్య చట్టం ప్రకారం ఎన్నికలలో పోటీ చేయడానికి అర్హత కోల్పోతాడన్న నిజాన్ని జగన్ విస్మరిస్తున్నాడన్నది నిపుణుల అభిప్రాయం. రాజకీయ ఆశలు, కోరికలు వున్న వారెవరూ ఆ పరిస్థితిని కొని తెచ్చుకోరు. కానీ ఇప్పుడు జగన్ చేతిలో ఏదీ లేదు. ఆయనే చెప్పినట్లు దేముడే కాపాడాలి ఆయన్ను.

అయితే రాచ పీనుగ ఒంటరిగా చావదన్నట్లు, జగన్‌తో పాటు చాలా మంది పారిశ్రామికవేత్తలు, ఐఎఎస్ అధికారులు, ప్రభుత్వ ఉద్యోగులు కూడా వూచలు లెక్క పెట్టవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. జగన్ అంటే, రాజకీయవాది కాబట్టి ధీమాగా వున్నాడు. కానీ వ్యాపారాలు చేసుకొనేవారు, ఉద్యోగాలు చేసుకొనేవారు ఒకసారి జైలుకు వెళ్లి వస్తే సమాజంలో ఎంతటి అవమానాలకు గురౌతారో సత్యం రామలింగరాజును చూస్తే అర్థమౌతుంది. తమ భవిష్యత్తు తలచుకొని అటువంటి వారంతా మానసికంగా కృంగి పోతున్నారు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

కలెక్టర్ ప్రారంభించిన సరస్వతి నిధికి 1,58,836 రూపాయలు విరాళంగా ఇచ్చారు. ఈ కార్యక్రమంలో జిల్లా పంచాయితీ అధికారి విజయకుమార్, డివిజనల్ పంచాయితీ అధికారి లక్ష్మణరావు తదితరులు పాల్గొన్నారు.

## సర్దార్ పటేల్ విగ్రహావిష్కరణ

ఉక్కు మనిషిగా పేరుగాంచిన సర్దార్ వల్లభాయి పటేల్ విగ్రహాన్ని వెంకటాచలంలోని అక్షర విద్యాలయంలో మాజీ ఉప ప్రధాని ఎల్.కె.అద్వానీ 21వ తేదీ ఆవిష్కరించారు. దేశాన్ని సమైక్యంగా వుంచడంలో పటేల్ చూపిన ప్రతిభ అద్వానీ ఈ సందర్భంగా కొనియాడారు. బిజెపి అగ్రనేత వెంకయ్య నాయుడు, లోక్‌సత్తా అధ్యక్షుడు జయప్రకాష్ నారాయణ, స్వర్ణభారత్ ట్రస్టీ దీపావెంకట్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## అద్వానీ వ్యాఖ్యలు అర్థరహితం

బిజెపి అగ్రనేత ఎల్.కె.అద్వానీ తన నెల్లూరు పర్యటనలో యుపిఏ ప్రభుత్వంపై చేసిన అవినీతి ఆరోపణలను తిరుపతి ఎమ్పీ చింతామోహన్ ఖండించారు. యుపిఏ పాలనలో గతంలో ఎన్నడూ లేనంతగా గ్రామీణాభివృద్ధి జరిగిందని, నల్లధనాన్ని వెలికి తీసేందుకు అన్నివిధాల కృషి జరుగుతుందన్నారు. నీతికి నిలబడబట్టే 2జి స్పెక్ట్రం కుంభకోణంలో దోషులను కాంగ్రెస్ పార్టీ జైలుకు పంపగల్గిందన్నారు.

## జగన్‌ను మద్దతుగా పాదయాత్ర

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిపై కుట్ర రాజకీయాలను మానుకోవాలని కోరుతూ ఆ పార్టీ నేతలు నెల్లూరు గాంధీ బొమ్మ నుంచి సూళ్లూరుపేట చెంగాళమ్మ ఆలయం వరకు మహాపాదయాత్ర చేపట్టారు. అనిల్‌కుమార్ నేతృత్వంలో పెద్ద ఎత్తున పార్టీ కార్యకర్తలు ఈ పాదయాత్రలో పాల్గొన్నారు. మార్గమధ్యంలో మసీదు, చర్చిలలోనూ పార్టీ కార్యకర్తలు ప్రార్థనలు చేస్తారు.

## ఎక్స్‌రే అవార్డుకు కవితల ఆహ్వానం!

విజయవాడలోని ఎక్స్‌రే సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ జాతీయస్థాయిలో అవార్డుకు కవితలను ఆహ్వానిస్తుంది. ప్రధాన అవార్డుకు ఎంపికైన కవితకు పదివేల రూపాయల నగదు, జ్ఞాపిక, సత్కారం చేస్తారు. మరో పది కవితలకు ఉత్తమ పురస్కారాలు ఇవ్వబడతాయి. కవితలు అక్టోబర్ 31వ తేదీలోగా ఎక్స్‌రే, పోస్ట్‌బాక్స్ నెం.340, కొల్లూరి టవర్స్, అరండల్ పేట, విజయవాడ –2 చిరునామాకు పంపమంటున్నారు. ఇతర వివరాలకు 98484 48763 నెంబర్‌కు సంప్రదించవచ్చు.

## ప్రకాశం పంతులు జయంతి!

ఆంధ్రరాష్ట్ర తొలి ముఖ్యమంత్రి ఆంధ్ర కేసరి టంగుటూరు ప్రకాశం పంతులు 139వ జయంతి 23వ తేది నగరంలోని సప్తగిరి హోటల్‌లో జరిగింది. ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ బ్రాహ్మణ సంఘ సమాఖ్య అధ్యక్షుడు వెల్లంచేటి చంద్రమౌళి ప్రకాశం పంతులు ఫోటోకు పూలమాలవేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమంలో సమాఖ్య కార్యదర్శి వి.శ్రీహరి ప్రసాదరావు, ఉపాధ్యక్షుడు హరికృష్ణ, సర్వేపల్లి ప్రసాద్, మధుసూధన్, నాగేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

## యూత్ కాంగ్రెస్ రక్తదానం!

మాజీ ప్రధాని స్వర్గీయ రాజీవ్‌గాంధీ 67వ జయంతిని పురస్కరించుకొని యూత్ కాంగ్రెస్ నెల్లూరు ఎసి సుబ్బారెడ్డి స్టేడియంలో రక్తదాన శిబిరం ఏర్పాటు చేసింది. వంద మందికి పైగా కార్యకర్తలు ఈ శిబిరంలో రక్తదానం చేశారు. రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఎన్.కె.యశ్వంత్‌సింగ్ ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం జరిగింది.

## ఆటోడ్రైవర్ల లబోదిబో!

నెల్లూరు సిటీ ఆటో డ్రైవర్స్ అసోసియేషన్ నేతృత్వంలో ఆటో డ్రైవర్లు 22వ తేది కెవిఆర్ పెట్రోలు బంకు నుంచి కలక్టరేట్ వరకు ధర్నా నిర్వహించారు. తాము ఎదుర్కొంటున్న సమస్యలపై జాయింట్ కలెక్టర్‌కు వినతి పత్రం సమర్పించారు. అక్కడ నుంచి ఎస్పీ రమణకుమార్‌ను కలసి పోలీసులు తమను అనవసరంగా దుర్భాషలాడుతున్నారని, అన్ని కాగితాలున్నా కేసులు నమోదు చేస్తామని డబ్బులు గుంజుతున్నారని, ఇండికేటర్ లైట్లను లాఠీలతో పగులగొట్టడం మూలంగా ఆర్థికంగా నష్టపోతున్నామన్నారు. అక్రమ వసూళ్లకు పాల్పడే కానిస్టేబుళ్ల వివరాలు తన దృష్టికి తీసుకవస్తే చర్యలు తీసుకొంటానని ఎస్పీ ఈ సందర్భంగా ఆటోడ్రైవర్లకు హామీ ఇచ్చారు.

## చంద్రబాబు విఫలం

16వ పేజీ కొరవ

వల్లనే తనకు అధిక ప్రమాదమన్న అంచనాతోనే చంద్రబాబు ఈ ధోరణి అవలంభిస్తున్నాడన్నది నిజం. జగన్‌కు ప్రజలలో వున్న ప్రాచుర్యాన్ని నిలువరించడం తెలుగుదేశం పార్టీకి సాధ్యం కావడం లేదు. జగన్ మీద గత ఆరేళ్లుగా ఎన్ని అవినీతి ఆరోపణలు చేస్తున్నా ప్రజలు పట్టించుకోవడం లేదు. రాజకీయాలలో తినని వాడెవడన్న వాదనతో జగన్ మీద వస్తున్న ఆరోపణలను విస్మరించి, వైఎస్ వల్ల తమకు కల్గిన మేలు మాత్రమే గుర్తు పెట్టుకొంటున్నారు. దానితో రేపటి ఎన్నికలలో కూడా తమకు అధికారం అందని ద్రాక్ష పండు అవుతుందన్న దిగులు తెలుగుదేశం వాదులలో గుబులు పెంచుతున్నది. అందువల్లనే వారు ఎంతకాలం వీలైతే అంతకాలం ప్రభుత్వాన్ని నిలబెట్టడానికి రెక్కల కష్టం చేస్తున్నారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

బిల్లు ఆమోదానికి ఎన్ని తిప్పలు పడ్డారో? ఉన్నత విద్య చదువుతున్న విద్యార్థినులకు ప్రభుత్వం నుంచి ఏమాత్రం సహకారం అందుతుంది? వికలాంగులైన మహిళల స్థితిగతులు అధ్వాన్నంగా వున్నాయి. ఆర్టీసి తోపాటు టౌన్‌బస్సులలో ప్రయాణించను మహిళలు ఎన్నో అగచాట్లు పడవలసి వస్తుంది. మహిళాభ్యుదయాన్ని పట్టించుకొనేవారే కరువయ్యారు.

కె.సత్యవతి నెల్లూరు

### దళిత క్రైస్తవులు – రిజర్వేషన్లు!

కొంతమంది జాతీయస్థాయి క్రైస్తవ నాయకులు దళిత క్రైస్తవులను దళితులుగా పరిగణించి రిజర్వేషన్లు ఇవ్వాలని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కోరుతున్నారు. దేశీయ మతాలు హిందూ, బౌద్ధ, సిక్కుల కన్నా విదేశీ మతాలు ముస్లిం, క్రైస్తవ, పార్శీలకు మన దేశంలో ఆదరణ ఎక్కువగా వుంది. రాష్ట్రంలో 90 శాతం మంది దళిత క్రైస్తవులుగా పరిగణింపబడుతున్న వారు ప్రభుత్వ రికార్డుల్లో మాత్రం దళిత హిందువులుగా నమోదై రిజర్వేషన్లు పొందుతున్నారు. దళిత క్రైస్తవులు బిసి – సి క్రింద రిజర్వేషన్లు పొందుతున్నారు. మతం మాత్రం క్రైస్తవం. రిజర్వేషన్ మాత్రం హిందూ మతం ప్రకారం పొందడం బాధాకరం. దళిత క్రైస్తవులకు ప్రత్యేక రిజర్వేషన్ ఇస్తే చాలా మంది హిందువులు మతం మార్చుకోవడం ఖాయం. కాబట్టి ఈ సమస్యపై ప్రభుత్వం జాగ్రత్తతో స్పందించ మనవి.

ఆలూరి ఆత్మానందం నెల్లూరు

# ప్రత్యేకాధికారుల పాలనలోకి గ్రామ పంచాయితీలు!

జిల్లాలోని గ్రామ పంచాయితీలు ప్రత్యేకాధికారుల పాలనలోకి వెళ్లాయి. పంచాయితీల పాలకవర్గం పదవీకాలం ఆగష్టు 22తో ముగియడంతో జిల్లావ్యాప్తంగా 961 సర్పంచ్‌ల్లో 946 మంది మాజీలయ్యారు. 15 మంది సర్పంచ్‌లు మాత్రం మరో రెండేళ్లపాటు పదవిలో కొనసాగనున్నారు. మొత్తం 961 పంచాయితీల్లో 42 మేజర్ పంచాయితీలు వున్నాయి. 2006 జూలై నెలలో 946 పంచాయితీలకు ఎన్నికలు జరగడంతో ఐదేళ్లపాటు పదవిలో వున్న సర్పంచ్‌ల పదవీకాలం ముగిసింది. సాధారణ పరిస్థితుల్లో అయితే గడువుకు ముందే ఎన్నికలు జరపాలి. రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితుల నేపథ్యంలో ఈ ఎన్నికలను ఇప్పట్లో నిర్వహించే పరిస్థితి కన్పించకపోవడంతో జడ్పీటిసి, ఎంపిటిసిలాగే పంచాయితీల నిర్వహణ కూడా ప్రత్యేకాధికారుల పాలనలోకి వెళ్లింది.

జిల్లాలోని ఎనిమిది మండలాల్లో మాత్రం 2006లో కాకుండా సర్పంచ్ ఎన్నికలు ఆలస్యంగా జరగడంతో ఆయా సర్పంచ్‌లకు మాత్రం పదవీకాలం మరో రెండేళ్లపాటు వుంది. దీంతో 15మంది సర్పంచ్‌లు మాత్రం తాజా మాజీలు కాకుండాపోతున్నారు. చిల్లకూరు మండలంలోని తమ్మినపట్నం సర్పంచ్ పదవీకాలం ఈ ఏడాది డిసెంబర్ 13తో ముగియనుంది. కొండాపురం మండలంలోని గొట్టిగుండాల, కలువాయి మండలంలోని తోపుగుంట, వెంకటాచలం మండలంలోని ఈదగాలి సర్పంచ్‌ల పదవీకాలం 2012 ఫిబ్రవరి 14 వరకు వుంటుంది. చిల్లకూరు మండలంలోని ఉడతావారిపాళెం సర్పంచ్ పదవీకాలం 2012 జూన్ 12 వరకు వుంటుంది. ఆత్మకూరు మండలం పమిడిపాడు పంచాయితీకి 2012 నవంబర్ 6వతేది వరకు, చిల్లకూరు మండలంలోని నెల్లబల్లి రెట్టపల్లి పంచాయితీ పాలక వర్గానికి 2012 నవంబర్ 11తేది వరకు గడువు వుంది. కొడవలూరు మండలంలోని తలమంచి, రేగడి చెలిక, కలిగిరి మండలంలోని వీరనకొల్లు, నాగసముద్రం కలువాయి మండలంలోని కనుపూరుపల్లి, చౌటపల్లి, దక్కిలి మండలంలోని మోపూరు, వెల్లంపల్లి పంచాయితీల పాలకవర్గాలు 2013 జూన్ 29తేదీ వరకు పదవిలో కొనసాగనున్నాయి.

ఆగష్టు 22తేదిలో పాలకవర్గాలు గడువు ముగిసినప్పటికీ పర్సన్ ఇన్‌చార్జ్‌లుగా తమనే కొనసాగించాలని రాష్ట్రవ్యాప్తంగా సర్పంచ్‌లు ప్రభుత్వ పెద్దలను కలిసి విన్నవించారు. గ్రామ కార్యదర్శులకు అదనపు బాధ్యతలున్న పరిస్థితుల్లో తమనే ఇన్‌చార్జ్‌లు చేస్తారని ఆశపడ్డారు. వీరి ఆశలన్నీ ప్రభుత్వం నిర్ణయంతో అడియాసలయ్యాయి. ప్రత్యేకాధికారుల పాలనకు ఆమోద ముద్ర వేస్తూ రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. ప్రత్యేకాధికారులుగా ఎంపిడిఓ కార్యాలయ సూపరింటెండెంట్లు, ఇఓ పిఆర్‌డి, పంచాయితీరాజ్ ఎఇ, ఆర్‌డబ్ల్యుఎస్ ఎఇ, ఐసిడిఎస్ సూపర్‌వైజర్లు, మండల విద్యాధికారులు, బిసి వెల్ఫర్ అధికారులను నియమిస్తూ ఆదేశాలు జారీ చేసింది. ఇప్పటికే జిల్లాలో మున్సిపాలిటీలు, మండలాల ప్రత్యేకాధికారుల పాలనలో నడుస్తున్నాయి. ఇప్పుడు పంచాయితీలు ఆ బాటలోనే పయనిస్తున్నాయి. ప్రత్యేకాధికారుల పాలనలో గ్రామపంచాయితీల అభివృద్ధి కుంటుపడుతుందనే విమర్శలు వ్యక్తమౌతున్నాయి. ఇప్పటికే అస్తవ్యస్తంగా వున్న పలు పంచాయితీల్లో పారిశుద్ధ్యం అధ్వాన్నంగా వుంది. మంచినీటి సమస్య ఎదురౌతోంది. ఈ పరిస్థితుల్లో ప్రత్యేకాధికారులు ఈ సమస్యలను ఎంతవరకు పరిష్కరిస్తారన్న దానిపై సర్వత్రా అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. మొత్తం మీద జిల్లాలో స్థానిక సంస్థలన్నీ ప్రత్యేకాధికారుల పాలనలోకి వెళ్లడం విశేషం.



పంచాయితీలకు ఇక ప్రత్యేకాధికారుల పాలనే దిక్కు.

# భావజగత్తులో విస్తృత విహారం చేసిన "రెండు పుస్తకాలు"

## కవిత్వ ప్రవాహం "ఆకుపచ్చ జరీ చీర"!

మోపూరు పెంచల నరసింహం నెల్లూరు జిల్లా గర్వించదగిన కవి – అతడిని, అతడి కవిత్వాన్ని విన్నప్పుడు నాకు ఆంగ్ల కవి జాన్‌మిల్టన్ గుర్తుకు వస్తాడు. కవులిద్దరికీ చూపులేదు, జ్ఞాన నేత్రాలున్నాయి. కళ్లున్న కవులు కూడా చూడలేని సామాజిక అంశాలను వీరు అంతర్ముఖులై, అంతర్నేత్రంతో చూస్తారు. నిజానికి చూడలేని వారిది కాదు, మనసులేని వారిదే వైకల్యం.

| ఆకుపచ్చ జరీచీర |
|---|
| కవితా సంపుటి |
| రచయిత : మోపూరు పెంచలనరసింహం |
| సమీక్షకుడు : పాయసం సుబ్రహ్మణ్య మహర్షి |
| పేజీలు : 48 ధర : 50/- |
| ప్రతులకు |
| రచయిత, 25–2–488, న్యూమిలటరీ కాలనీ, నెల్లూరు – 4 |

**"నడవలేని, చూడలేని వారిది కాదు మనసులేని వారిదే వైకల్యం"**

ఇది కవి స్వయంగా రాసుకున్నదే! "ఆకుపచ్చ జరీ చీర" కవితా సంకలనంలోనిది. కవితలన్నీ చదివాక సమాజాన్ని, సమాజంలోని దురన్యాయాల్ని మానసికంగా, గొప్పగా భావించాడనీ, అనుభవించాడనీ నాకనిపించింది. సమాజంలోని స్త్రీ, ఆడపిల్లను గురించి చెబుతూ

**"గర్భసంచి ఖననం తప్పించుకుందా? కట్నాగ్ని జ్వాలల్లో దహనం"** అంటాడు.

కవిత చదివాక మనసు ఉద్విగ్నభరితమవుతుంది. మృగాళ్లైన మగాళ్లని, ముక్కలు చేయాలనిపిస్తుంది. మరో చోట అంటాడిలా –

**"చరిత్ర పుస్తకమంతా శవాలు కాల్చున్న కమురువాసన"**

హింసపట్ల హృదయాంతర్గమైన కవిత్వంలో ఇంతటి కసి ఉజ్వల జ్వలనం కానేరదు! కవిలో వ్యంగ్యం, స్పందనలు కూడా వున్నాయి.

**"కాదేదీ అద్దెకనర్హం అది గదియైనా గర్భసంచి అయినా"**

ప్రాపంచిక నేపథ్యాన్ని అధ్యయనం చేయకపోతే ఇలాంటి కవితను రాయలేరు కదా? సంపుటిలో చాలా భావచిత్రాలున్నాయి.

**"గరిక సెల్యూట్ చేస్తోంది జవాను సమాధి ముందు నిలబడి"**

ఈ కవిత చదివాక భావాన్ని ఎంత అద్భుతంగా చెప్పవచ్చో అర్థమవుతుంది. పెంచల నరసింహం అసలు సిసలు నిజమైన సత్తా వున్న కవి అందువల్లే –

"కవిత్వం రాయడమంటే అంతరంగంలోకి ప్రయాణించడమే" అంటాడు. ఇదెంత నిజం! కవిత్వమంత నిజం!!

## 'కూనలమ్మ' ముద్రతో "పెన్నేటి పదాలు"!

నలుగురు కవి మిత్రులు కలసి కోయిలమ్మ పదాలు(మోపూరు పెంచల నరసింహం), వెన్నెలమ్మ పదాలు(గుండాల నరేంద్రబాబు), జాబిలమ్మ పదాలు (కె.ఎస్.రాఘవాచార్యులు), చందమామ పదాలు (అవ్వారు శ్రీధర్‌బాబు) ఒక్కొక్కరు యాభై పదాల చొప్పున సంకలనం చేసి ఓ సంపుటి వేశారు. (వీరిని ఓ కవన్నట్లు కవిచతుష్టయం అని అనలేను). నలుగురూ వర్ధిష్ణువులే – ఈ సంకలనాన్ని 'పెన్నేటి పదాలు' అన్నారు.

కోయిలమ్మ పదాలు రాసిన మోపూరు పెంచల నరసింహం(కోకిలమ్మ అన్న పదమే నిజానికి కరెక్టు) తరువు, గురువు, చదువు పదాల్ని చక్కగా విశ్లేషించారు.

**"గాలినిచ్చును తరువు, జ్ఞానమిచ్చును గురువు సకలమిచ్చును చదువు ఓ కోయిలమ్మా!"**

జ్ఞానజ్యోతిని సాధిస్తే సకల విజ్ఞానాన్నీ సాధించినట్టే కదా?

నిజం నిప్పులాంటిది కదా? ఎయిడ్స్‌ను గురించి ఆ మాటే అంటాడు.

**"చాలు ఒకటే భామ, వద్దు వేశ్యల ప్రేమ కుట్టు ఎయిడ్స్ దోమ ఓ కోయిలమ్మా!"**

వెన్నెలమ్మ పదాల్లో గుండాల నరేంద్రబాబు పరహితం ఎంత గొప్పదో చెప్పక చెప్పాడు.

**"పరిమళం పువ్వులది, పరవశం మనసులది పరహితం మరువనిది ఓ వెన్నెలమ్మా!"** కవిత్వాన్ని విశ్లేషిస్తూ

**"కవిత్వమో తపస్సు, కవిత్వమో ఉషస్సు, కవిత్వమో యశస్సు ఓ వెన్నెలమ్మా!** అంటాడు మరో పద్యంలో.

రాజకీయాలపై ఏహ్యభావం కూడా సూటిగా వుంది.

**"రాజకీయం రొచ్చు, నక్కజిత్తుల ఉచ్చు, చిక్కుకుంటే చచ్చు ఓ వెన్నెలమ్మా!** ఇలా కవితలన్నీ కూడా అనుభవగీతల్లా వుంటాయి.

| పెన్నేటి పదాలు |
|---|
| కవితా సంకలనం |
| రచయితలు : నలుగురు కవి మిత్రులు |
| సమీక్షకుడు : పాయసం సుబ్రహ్మణ్య మహర్షి |
| పేజీలు : 40 ధర : 50/- |
| ప్రతులకు |
| జి.నరేంద్రబాబు, 26–12–627, మల్లెతోట బి.వి.నగర్, నెల్లూరు – 4 |

కె.ఎస్.రాఘవాచార్యులు జాబిలమ్మ పదాల్లో సమైక్యవాదం స్ఫూర్తి ఇలా వుంటుంది.

**కలతలే వద్దు, కలసి వుంటే ముద్దు కులమతాలే రద్దు ఓ జాబిలమ్మా**

మొత్తం కవితలో తళుక్కున మెరిసినవి కొన్నే! ఎడిట్ చేసుకోవలసినవీ వున్నాయి. ఆత్మ పరిశీలన, ఆత్మ విమర్శ వల్ల వీరు ఎదుగుతారన్న నమ్మకం వుంది.

# ఎమ్మెల్యేల రాజీనామాలు దొంగ నాటకం!

## జగన్‌తో వున్నవారెవరూ పదవులు వదులుకోవడానికి సిద్ధంగా లేరు

జగన్ మీద మోపిన అక్రమాస్తుల కేసు ఎఫ్ఐఆర్‌లో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేరు చేర్చారన్న నెపంతో 29 మంది ఎమ్మెల్యేలు రాజీనామా చేశారు. చూసే వారికెవరికైనా జగన్ మీద వారికెంత ప్రేమో కదా అనిపిస్తుంది. జగన్ కోసం తమ పదవులు తృణప్రాయంగా వదలుకొంటున్న త్యాగధనులుగా కన్పిస్తుంది. కానీ రాజీనామాల విషయంలో వారు అనుసరించిన పోకడచూస్తే మాత్రం అదంతా ఒట్టి నాటకమని తేలిపోతుంది.

ఎఫ్ఐఆర్‌లో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేరు చేర్చారన్న నెపం శుద్ధ అబద్ధం. ఎఫ్ఐఆర్‌లో పేర్కొన్న 74 మంది నిందితులలో వైఎస్ పేరు లేదు. కనీసం వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అవినీతికి పాల్పడ్డాడన్న నింద కూడా లేదు. వైఎస్ కొడుకుగా జగన్మోహన్‌రెడ్డి అక్రమాలు చేశాడన్న వాక్యం మాత్రమే వుంది. నిందితుల పేరు వ్రాసేటప్పుడు తండ్రి పేరు వ్రాయడం తప్పనిసరి కాబట్టి వ్రాసిందే తప్ప వైఎస్‌ను నేరస్తుడిగా చిత్రీకరించడానికి ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. కానీ జగన్ అనుచరులు మాత్రం ఎఫ్ఐఆర్‌లో వైఎస్‌ను నిందితుడుగా పేర్కొన్నారన్న ప్రచారాన్ని ఉధృతంగా జరిపిస్తున్నారు. దానివల్ల కలిగే రాజకీయ ప్రయోజనాలు తాత్కాలికమైనవి.

ఈ ఎమ్మెల్యేలు ఎవరిలోనూ పదవి వదులుకోవాలనే ఆలోచన లేదు. జగన్‌తో ఉన్నామని చెప్పుకోవడానికి మాత్రమే ఈ ప్రహసనం. తాము చేసే రాజీనామాలు ఆమోదం పొందవన్న నిజం వారికి తెలుసు. పొరపాటున స్పీకర్ ఆమోదముద్ర వేస్తాడనే భయంతో పదే పదే తమ రాజీనామాకు కారణం ఎఫ్ఐఆర్‌లో వైఎస్ పేరు చేర్చడమే అని ప్రకటనలు గుప్పిస్తున్నారు. అటువంటి కారణాలతో రాజీనామాలు చేసినా, గుంపుగా పత్రాలు సమర్పించినా ఆమోదానికి అర్హత వుండదన్న నిజం వారికి తెలుసు.

నిజంగా ఆ ఎమ్మెల్యేలకు తమ పదవులు వదులుకొని మరీ జగన్‌కు అండగా నిలవాలన్న కోరిక వుంటే తమ బలంతో ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టాలన్న రాజకీయ వ్యూహం వుంటే, నేరుగా రాజ్‌భవన్‌కు వెళ్లి గవర్నర్‌ను కలిసి, ప్రభుత్వానికి తమ మద్దతు ఉపసంహరిస్తున్నామనే లేఖ ఇస్తే చాలు. అంతమంది ఎమ్మెల్యేలు మద్దతు ఉపసంహరిస్తున్నట్లు తెలిపిన పక్క క్షణం గవర్నర్ కిరణ్‌కుమార్‌రెడ్డిని పిలిపించి బల నిరూపణకు శాసనసభలో విశ్వాస పరీక్ష ఎదుర్కోవాలని ఆదేశిస్తాడు. అటువంటి పరీక్ష పెట్టినప్పుడు తెలుగుదేశం వంటి ప్రతిపక్షాలు ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రభుత్వానికి మద్దతు తెలపలేవు. ప్రభుత్వం కూలిపోయే అవకాశం ఏర్పడుతుంది.

నిజానికి గత ఆరునెలలుగా జగన్ కోరుకొంటుంది కూడా అదే. తెలుగుదేశం పార్టీ అవిశ్వాస తీర్మానం పెడితే తన బలం నిరూపిస్తానని పలుమార్లు సవాలు కూడా చేశాడు. చంద్రబాబు కాంగ్రెస్‌తో కుమ్మక్కై దొంగనాటకం ఆడుతున్నాడని నిందించాడు. ఇప్పుడు తనకు స్వయంగా అటువంటి అవకాశం వస్తే, దాన్ని వదలిపెట్టి, రాజీనామాల నాటకంతో పొద్దు పొచ్చుతున్నాడు.

ఎమ్మెల్యేలు గవర్నర్‌ను కలిసి మద్దతు ఉపసంహరణ లేఖ ఇవ్వకుండా, మాయ చేయడానికి కారణం – తమ పదవులు పోతాయన్న భయం. కర్ణాటకలో యడ్యూరప్పకు ఇటువంటి పరిస్థితి ఎదురైనప్పుడు మద్దతు ఉపసంహరించినట్లు లేఖ ఇచ్చిన ఎమ్మెల్యేలందరినీ పార్టీ ఫిరాయింపుల నిరోధ చట్టం క్రింద అనర్హులుగా ప్రకటించాడు ఆ శాసన సభ స్పీకర్. ఆ నిర్ణయాన్ని హైకోర్టు కూడా సమర్ధించింది. ఇప్పుడు కిరణ్ కుమార్‌రెడ్డి కూడా అటువంటి నిర్ణయం తీసుకొంటే తమ పదవులు పోతాయన్న భయంతోనే ఎమ్మెల్యేలు రాజ్‌భవన్‌కు వెళ్లడం మాని ఇడుపుల పాయకు వెళ్లి వైఎస్ సమాధి వద్ద ఉత్తుత్తి ప్రతిజ్ఞలు చేసి వచ్చారు. రాజీనామాలు చేయడానికి సిద్ధపడిన వారికి పదవులు పోతాయన్న భయం ఎందుకు?

## కార్టూన్ స్కేప్



మా పిల్లలేరా! ఆడుకుంటున్నారు... వాళ్లేమో సిబిఐ, వీడు జగనట...!



## టిఎస్ఆర్ మహిమకు

# చిరంజీవి ఒళ్లు జిల్లన్నది!

అధిష్టానం పెద్దలంటే కాంగ్రెస్‌వాదులకు దేముళ్లతో సమానం. కొంచెం కష్టానికి ఓర్చితే దేముడి దర్శనమైనా దొరుకుతుంది కానీ, ఢిల్లీ దేవిడీలలోకి ప్రవేశం మాత్రం దుర్లభం. కాంగ్రెస్‌లోకి కొత్తగా వచ్చిన చిరంజీవి వంటి వారికి ఆ రాజకీయ దేముళ్ల మీద ఎంత భయభక్తులుంటాయో చెప్పనవసరం లేదు.

రాజ్యసభ సభ్యుడు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి మొన్న 20తేది ఢిల్లీలో చిరంజీవి కాంగ్రెస్‌లో చేరుతున్న సందర్భంగా విందు ఇచ్చాడు. దానికి అహ్మద్ పటేల్, గులాం నబీ అజాద్, జనార్ధన ద్వివేది, ప్రధానమంత్రి కార్యాలయ మంత్రి నారాయణస్వామి వంటి వారంతా వచ్చారు. అంత మంది అధిష్టాన దేముళ్లు ఒకేచోట కన్పించడంతో చిరంజీవి ఒళ్లు జిల్ అన్నది. సుబ్బరామరెడ్డికి ఢిల్లీ దేవిడీలో వున్న పలుకుబడిని కళ్లారా చూసి నోరు వెళ్లబెట్టాడు. దానికి తగ్గట్లే తన కాంగ్రెస్ ప్రవేశ మహోత్సవానికి రాహుల్‌గాంధీ రావడం అనుమానమన్న వార్త చిరంజీవిని కలత పెట్టింది. ఆయన బాధ చూసిన టిఎస్ఆర్, ఎఐసిసిలో తన పలుకుబడిని ప్రయోగించి, రాహుల్‌గాంధీని ఒప్పించి, తీసుకవచ్చాడు. సుబ్బరామరెడ్డి వల్లనే రాహుల్ వచ్చాడన్న నిజం అర్థం కావడంతో చిరంజీవి ఆనందానికి పట్టపగ్గాలు లేవు. ఆ కృతజ్ఞతతో పక్క రోజు గాంధీభవన్‌లో జరిగిన సభకు టిఎస్ఆర్‌ను ప్రత్యేకంగా పిలుచుకొన్నాడు చిరంజీవి.

# చంద్రబాబు విఫలం

జగన్ ఎమ్మెల్యేల రాజీనామా వల్ల తలెత్తిన రాజకీయ సంచలనాన్ని తన కనుకూలంగా మలచుకోవడంలో ప్రతిపక్ష నేత చంద్రబాబు నాయుడు దారుణంగా విఫలమౌతున్నాడు. వైఎస్ మరణానంతరం జగన్ రాజకీయ తెర మీదకు వచ్చినప్పటి నుంచి చంద్రబాబు కాంగ్రెస్ కంటే జగన్‌నే తన శత్రువుగా భావిస్తూ వస్తున్నాడు. అందువల్లనే ప్రభుత్వం ఎన్నిసార్లు పతనం అంచుకు చేరుకొన్నా ప్రతిపక్షంగా ఆ పుణ్యకార్యాన్ని పూర్తిచేయడానికి ప్రయత్నించడం మాని, ప్రభుత్వం పడకుండా నిలబెట్టేందుకు సహకారం అందిస్తూ వస్తున్నాడు. ఇప్పుడు కూడా ఆయన అదే పోకడ అనుసరించడం విచిత్రం.

రేపటి ఎన్నికలలో కాంగ్రెస్ కంటే జగన్

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com